# యమ్ జి ఆర్

దీనజనోద్ధారకుడు, దయా సముద్రుడూ, ప్రజాహృదయాధినేత, పసిమి ఛాయ పసిడిమనసూతో పలుకుతీపి నెరిగిన పతితపావనుడు, కళా కౌముదిలో జీవనరాగాన్ని పలికిస్తూ ఆశయ సౌధానికి ఆచరణ పథానికి వారధి ఏర్పరిచిన మహాశిల్పి, సమగ్రత సమైక్యతల తర్వాతనే భాషా సంస్కృతికి చోటిచ్చిన జాతీయతావాది, విజ్ఞులను సంగీతజ్ఞులను మనఃపూర్వకంగా గౌరవించిన మానవతా మూర్తి, లలితకళా ప్రాభవంలోనే సమాజోన్నతకి రాగతాళాలు వున్నాయని తెలిసిన రసధుని, మధ్యాహ్నభోజనం పేరిట ఆర్తులను ఆదుకున్న అన్నదాత, వెండితెరకీ జీవన్నాటకానికీ వంతెన కట్టిన నిర్మాణ సారథి, తమిళనాడుకే గాక యావద్భారతానికీ జాతిరత్నమైన 'యమ్ జి ఆర్', 1987 డిసెంబరు 24 ఉదయం మూడుగంటలవేళ, సాధారణ నిద్రనుంచి దీర్ఘనిద్ర లోకి నిర్గమించి, రాష్ట్రాన్నీ దేశాన్నీ శోకసాంద్రంలో ముంచారు. 'దేహినో అస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా, తథా దేహాంతరప్రాప్తి ర్ధీరస్తత్ర న ముహ్యతి' (గీత: 2-13) అని సరిపెట్టుకోక తప్పదు. అణ్ణా సమాధి పక్కన స్మృతి మందిర మయారు యమ్‌జిఆర్.

తన పదేళ్ల ముఖ్యమంత్రిత్వంలోను, పేదలకెన్నో సహాయకార్యక్రమాలు ప్రవేశపెట్టడమే గాక, జాతీయ నాయకులలో మణిదీపమనిపించుకున్నారు యమ్‌జిఆర్.

—రాష్ట్రపతి వెంకట్రామన్

ఎటువంటి క్లిష్ట పరిస్థితిలోనైనా, ప్రజాక్షేమం దృష్టిలోపెట్టుకు, సిద్ధాంత న్యాయం విడనాడకుండా ముందుకి సాగిన ధీరచరితుడూ దేశభక్తుడూను.

—ఉపరాష్ట్రపతి శంకరదయాళ్ శర్మ

సత్యము, అహింస, కరుణ, అనే మూడు సూత్రాలకి కట్టుబడి, నిరుపేద లను, నిర్భాగ్యులను ఆదుకుంటూ, ప్రజాస్వామిక వ్యవస్థలో దౌర్జన్యానికి స్థానం లేదని నిరూపిస్తూ వసుధైక కుటుంబధ్యేయం వైపు ప్రజలను నడిపిన మహా మనీషి, యమ్ జి రామచంద్రన్.

—ప్రధాని రాజీవ్‌గాంధీ

ప్రేమాస్పదుడైన అన్నగారిని కోల్పోయిన తమ్ముని దుఃఖం నాది. నలభైఏళ్ల అనుబంధం—అన్నిటా నాకు సలహాయిస్తూ హితవు చెప్పే వారాయన.

—ఆంధ్ర ముఖ్యమంత్రి యన్ టి ఆర్

JAGATI Rs. 2-00 February 1988

33rd Year of Publication

# జగతి

ఎడిటర్ : చందూర్

ఫిబ్రవరి - 1988




పర్యాటకుల సంభాషణ

—'జర్మన్ న్యూస్ వీక్లీ' సౌజన్యంతో

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు రు. 100-00. జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: ఉపరాష్ట్రపతి శంకరదయాళ్ శర్మ

# నిమ్మతొనలు

నేను నాటకంలో ఒక ముఖ్య పాత్ర ధరిస్తున్నానోయ్.
'హీరోవా ?'
'కాదు - పోస్టుమేన్'
'అది అంత ముఖ్య పాత్రా ?'
'అవును'
'ఎలా ?'
'తెరతీయడంతోనే, నేను వచ్చి 'పోస్ట్' అని అరిచి ఒక ఉత్తరం ఇచ్చి వెళతాను. ఆ తరువాత నాటకమంతా ఆ ఉత్తరం మీద ఆధారపడి నడుస్తుంది.'

—కె నాగేశ్వరరావు
నరసరావుపేట

ఏమండీ నేను నెల తప్పాను' - సిగ్గుపడుతూ భర్తతో చెప్పింది శ్రీలేఖ. 'తప్పితే తప్పావు - బాధ పడకు. ఈసారి గట్టిగా కృషి చేస్తే వచ్చేనెల పాసవుతావులే,' ఓదార్పుగా అన్నాడు, పరీక్ష పేపర్లు దిద్దుకుంటున్న కృష్ణారావు మాష్టారు.

—జి రాము
నందిగామ

విూ ఆయన నిద్రలో లేచి నడిచి పోతూండే వారుగా - ఇప్పుడా వ్యాధి నయమైందా ?' - అడిగింది శారద.

'ఆ, బ్రహ్మాండంగా పోయింది - నేనాడిన చిన్న అబద్ధంతో' అంది కళ్యాణి.

'ఏం చేశావేమిటి ?' - ఆశ్చర్యంగా ప్రశ్నించింది శారద.

'పెళ్ళి కాకముందు నాకు ఇలానే నిద్రలోంచి లేచి వెళ్లే అలవాటుందని చెప్పాను, ఇక అంతే అప్పటినుంచి ఆయనకు జబ్బు నయమయింది.' - అసలు సంగతి గర్వంగా చెప్పింది కళ్యాణి.

—భవాని
మచిలీపట్నం

నేను ఇన్నాళ్ళు ప్రేమిస్తున్నానని చెప్పేవాడినే. అదిగో, ఆ అమ్మాయినే నేను గాఢంగా ప్రేమిస్తున్నది, ఎలా వుంది ?' దారిన పోతున్న ప్రేయసిని చూపించి చెప్పాడు శేఖర్.

'అదా ? దాన్నెందుకు ప్రేమించావు ? అది పెద్దగయ్యాళి. దాన్ని పెళ్ళి చేసుకుంటే, ఆ గోల నువ్వు భరించ లేవు' అన్నాడు శ్రీధర్.

'ఆమె గయ్యాళా ? నీకెలా తెలుసు ?' ఆశ్చర్యంగా అడిగాడు శేఖర్.

'నేను దాని మొగుడ్ని . ఆ మాత్రం తెలియదా ?' తాపీగా చెప్పాడు శ్రీధర్.

—సెల్వి
నందిగామ

వట్టి ఆఫీసరు వట్టి ఫూలోయ్ - అన్నాడు శంకరం. 'ఆ విషయం నాకూ తెలుసు' - సుందరం కామెంట్.

'నేను చెప్పకుండా నీ కెలా తెలుసు ?'

'నీకు ఉద్యోగం ఫూల్ కాక ఇంకె వడు ఇస్తాడు ?'

—యమిడి గౌస్
రేపల్లె

హలో, ఎస్సయ్‌గారూ, మీరు త్వరగా రావాలి. పట్టపగలే మా తాతయ్య గోవిందరావుగార్ని కట్టేసి నిలువునా కాల్చేస్తున్నారు' - కంగా రుగా ఫోన్ చేశాడు శ్రీధర్.

'చూడు బాబూ : అడ్రస్ ఎక్కడో కాస్త చెప్తావూ ?' టెన్షన్‌తో అడిగాడు ఎస్సయి భరద్వాజ.

'ఊరి చివర. స్మశానంలో నండి' - అన్నాడు ఆరేళ్ల శ్రీధర్.

—ఇ సుబ్రహ్మణ్యేశ్వరావు
మచిలీపట్నం

ఓ పాప బురదలో పడింది. ముఖానికి అంతా బురద అయింది.

'పాపా, నీ దగ్గర కర్చీఫ్ ఉందా ?' అని అడిగాడు పక్కగా పోతున్న పెద్ద మనిషి.

'మా అమ్మ కర్చీఫ్ ఎవరికీ ఇవ్వ వద్దంది, సార్'

—బి నరసింహారావు
విజయవాడ-13

ఏవండీ మన పక్కింటి పంకజాక్షి కూతురు ఎవరితోనో లేచి పోయిం దటండీ - అని ఆనందంతో చెప్పింది కాంతం.

'అలా సంబరపడకు, ఆ లేపుకు పోయింది ఎవరో తెలుసా ? మనక్కా బోయ్ అల్లుడు - అదే మీ అన్నయ్య గారి ముద్దుల కొడుకు' - వివరించి చెప్పాడు భర్త రాజేశ్వర్రావు.

—కె సత్యనారాయణ
మెలవరం

# పాఠకుల తీర్పు

డియర్ చందూర్‌జీ; అస్సాం అగ్రికల్చరల్ యూనివర్సిటీ వర్క్‌షాప్‌లో ఎకడమిక్ పేపర్ ప్రజంట్ చేసేందుకు ఈ మధ్య జోర్హాట్ వెళ్ళాను - నవంబరు ఒకటో తేదీన మద్రాసు మీదుగా తిరుపతి చేరుకున్నాను. కలకత్తా విశాఖల నుంచి వచ్చే ఫ్లయిట్ ఉదయం తొమ్మిది గంటల వేళ శ్రీహరి కోట తీరం మీదుగా వచ్చింది. ఎన్నూర్, మద్రాసు హార్బరు, మెరీనా బీచ్, యూనివర్సిటీ బిల్డింగ్స్, ఆలిండియా రేడియో, శాంతోమ్ చర్చ్ ఇవన్నీ ఎంతో స్పష్టంగా కన్పించాయి. అంతే కాదు, యాపిల్‌గ్రీన్ కలర్‌తో ఉన్న మీ ఇల్లు, రూఫ్ గార్డెన్, దొడ్లో వేసిన కొబ్బరిచెట్టూ, పొడుగాటి కొబ్బరాకులు కన్పిస్తూంటే ఎంత ఆనందం కలిగిందో చెప్పలేను. నాలో కలిగిన 'వైబ్రేషన్స్' ఆనాడు మీకు అంది ఉండాలి. శాంతోమ్ చర్చి నుండి కుడివైపుకి తిరిగి మౌంట్‌రోడ్ మీదుగా ఎయిర్‌పోర్టు చేరుకుంది మా విమానం - వ్యవధి లేక ఇంటికి రాలేదు. పిల్లలూ, అన్నపూర్ణారెడ్డి గారు క్షేమం. మాలతీ గారికి, శారదాంబ గార్కి మా నమస్కారములు అందచేయండి.

—ప్రొఫెసర్ యమ్వి రెడ్డి
తిరుపతి

శ్రీ చందూర్ గార్కి నమస్తే 'జ గ తి' చదువుతుంటే చాలా సంతోషంగా వుంటుంది – ప్రతి అక్షరం విడవకుండా చదువుతాను. మీ అంతటి వారికి ఉత్తరం వ్రాయాలంటే ఏదో భయంగాను, సంకోచంగాను వుంటుంది. మీ విజ్ఞాన సంపదలో నేను వ్రాసే నాలుగు ముక్కలు ఏపాటి? మీనుంచి ఎన్నో ఎన్నో సంగతులు తెలుసుకోవాలని వుంది. "వనిత" లో ఆ మధ్య మీ కథ (మంగళూరు మెయిలు) చదివినాను - నాకు చాలా నచ్చింది.

—శకుంతలారావు
లొంబార్డ్ - అమెరికా

శ్రీ చందూర్ గార్కి: నవంబరు సంచికలో, నెహ్రూ గూర్చి మీరు ఎప్పుడో వ్రాసినది, ఎప్పుడూ నిజమన్నది నిజం కాదా! నా అభిమాన సంగీత విమర్శకులు V. A. K., సునిశిత హాస్యానికీ అపహాస్యానికీ గల సున్నితమైన వ్యత్యాసం ఎంతో చక్కగా చెప్పారు.

—వి అశ్వనీకుమార్
విజయవాడ-10

# ప్రాచీన సాహితి

ఇంచుక ముద్దు లేనగవు లింపగు నవ్యవిలాస సూక్తు ల
భ్యంచిత లోల దృష్టియు న వారుణ పల్లవమండలంబు ని
ర్మించు సలీల యానములు మేలుగ యౌవనలక్ష్మి తోడ వ
ర్తించు మృగాక్షి చందము లతి ప్రమదంబు ఘటింప జాలవే

—భర్తృహరి

తొంగుండ మంచంబు దొరలేదని కృశింప
బంటున కబ్బునే పట్టుపరుపు
దొరసాని కొకవల్లె దొరక దంచు గృశింప
దొత్తుకు గల్గునే తొగరు చీర
అంబటి కు ప్పబ్బ దని కృశించెడి వాడు
వాంఛ సేయునె పిండి వంటలకును
గంకుల నొజ్జలే కాలంబు గడపంగ
నూచ బియ్యంబు శిష్యులకు గలవె
ఇంగిత విచార మాత్మలోనించు కయిన
నూహ సేయక కలిచోయ నుట్ల వంక
జూచు చుండెద రజ్ఞ లీక్షిణియందు
రామలింగేశ రామచంద్ర పురవాస

—రామలింగేశ శతకం

తరువుల పొంత పొంచి వసుధావరమిత్రుడు గాంచె నచ్చటం
దరుణి దమో వినీలకచ దామర సోదర సోదర ప్రభం
దరళ విలోచనం దతనితంబ దటిన్నిభ గాత్ర వల్లరిం
దరుణ శశాంక ఫాల నొక తన్వి దరంగ వళిం దలోదరిన్.

—రామరాజ భూషణుని 'వసుచరిత్ర'

# పాతికేళ్ళ నాటి పిక్చర్

## అన్నపూర్ణవారి చదువుకున్న అమ్మాయిలు

తెలుగు సాహిత్య సీమలో రాజ హంసవలె ప్రకాశించిన డాక్టర్ శ్రీదేవి, ఆంధ్రులు ప్రత్యేకించి చెప్పుకోదగ్గ ఒక ఉత్తమ నవలను ముందు తరాలవారి కోసం వొదలి వెళ్ళారు. 'చదువుకున్న అమ్మాయిలు' చిత్ర నిర్మాణ సమయంలో డాక్టర్ శ్రీదేవి 'కాలాతీత వ్యక్తులు' నవలనే, అన్నపూర్ణావారు వెండితెర కెక్కిస్తూన్నారనే ప్రచారం జరిగింది. ఈ కథను వ్రాసినది కూడా డాక్టరు శ్రీదేవే అయివుండటం అందుకు ఒక కారణం కావచ్చు. లేక, 'కాలాతీత వ్యక్తులే', చదువుకున్న అమ్మాయిలుగా చిత్ర రూపం దాల్చిందేమో! ఏమైనా ఆ నవలకీ ఈ పిక్చరుకీ వసంత తాతగారి మరణంలోను, పెళ్ళిళ్ళలోను తప్ప ఎక్కడా పోలికలు లేవు. ఆ మరణాన్ని కూడా శ్రీదేవి యాదృచ్ఛిక ఘటనగా చిత్రించారు. పిక్చర్ అలాలేదు. ఆ మరణం చుట్టు కొన్ని మెలికలు వేశారు. చదువుకున్న అమ్మాయిలు చిత్రానికి స్వర్గీయ శ్రీదేవి కథ వ్రాశారు. స్వర్గీయ గోపీచంద్ సంభాషణలు వ్రాశారు. ఆ యిరువురు సాహిత్య ముద్ర, ఇందులోని ముగ్గురు అమ్మాయిలు మీద పడుతోంది. ఈ ముగ్గురమ్మాయిలకు కేంద్ర స్థానమైన బాంక్ గుమస్తా (నాగేశ్వరరావు) నటనలో ఉదాత్తస్థాయి నందుకోగలిగాడు తప్ప, అసలు పాత్రలో పటుత్వం లేదు. శేఖర్ సినిమా డాన్‌జువాన్. ఈ డాన్‌జువాన్ శ్రీరాముని ఆదర్శంగా కలిగి ఏకపత్నీ వ్రతుడవాలి గనుక, లక్షలుగల అమ్మాయి (సుజాత-సావిత్రి) బీద అమ్మాయి (వసంత - కృష్ణకుమారి)లలో, బీద అమ్మాయిని ఎన్నుకుంటాడు. ధనాసక్తుడవడం ఉత్తమ సినీనాయకుని లక్షణం కాదు గదుక! హాస్యరసాంబుధిలో ముంచేందుకు రేలంగి, సూర్యకాంతం వుండనే వున్నారు. నాలుగు వివాహాలు, ఒక మరణం గల ఈ చిత్రంలో, 'చదువుకున్న అమ్మాయిల'ను ఆదర్శమూర్తులుగా, త్యాగ దక్షులుగా చూపడం. బాలా ముదావహమైన విషయం అందుకు అన్నపూర్ణవారు ఎంతో అభినందనీయులు. ఈ చిత్రానికి దర్శకులు ఆదుర్తి. నిర్మాత: దుక్కిపాటి మధుసూదనరావు.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - ఫిబ్రవరి 1963

---

మానవుడు ఉదాత్తమైన మృగం - జనన మరణాలు రెండూ అతనికి పండగలే !

—బ్రవున్

# వెన్నెల కెరటాలు

## పెంగ్విన్లు

పెంగ్విన్‌లు మనోరంజకమైన పక్షులు. వీటికి రెక్కల మీద ఈకలు పొలుసులలాగా ఉండటంవల్ల, క్విల్స్ లేకపోవడంవల్ల అవి ఎగరలేవు. కాని అవి నీళ్ళలో బాణాలలాగా దూసుకొని పోగల ఈదే పక్షులు. అయితే భూమి మీద అవి శరీరాన్ని నిట్టనిలువుగా విచిత్రంగా ఉంచి, గాంభీర్యం, విజ్ఞానంగల, విశ్వవిద్యాలయపు వృద్ధ అధ్యాపకునిలాగా సంచరిస్తుంటాయి. విచిత్రమైన వీటిని అందుకే 20వ శతాబ్దంలో పెంగ్విన్‌లు అని నామకరణం చేశారు. స్పెయిన్ భాషలో పెంగ్విన్ అంటే క్రొవ్వు అని అర్థం. అంటార్కిటికాలోని చలిని తట్టుకోనేందుకై వీటి చర్మం క్రింద ఎక్కువగా క్రొవ్వు ఉన్న కారణంగా 17వ శతాబ్దంలోని స్పెయిన్ నౌకా యాత్రికులు దీనిని ఆ పేరుతో పిలిచారు. అంటార్కిటికా ప్రాంతంలో 20వ శతాబ్దం మొదట్లో పెంగ్విన్‌ల సంఖ్య 5 నుండి 7 లక్షలుగా ఉంటుందని అంచనా. వెనుకటి రోజులలో ఒక్క మైక్వేర్ ద్వీపంలో సంవత్సరానికి 2 లక్షల 50 వేల పెంగ్విన్‌లు చంపేవారు. 1933లో ఈ ద్వీపాన్ని పెంగ్విన్‌లను రక్షించే స్థలంగా ప్రకటించారు. ఇపుడు అంటార్కిటికా సముద్రంకూడా పెంగ్విన్‌నుల భద్రపరచే ప్రదేశం. అంటార్కిటికాలో 6 జాతుల పెంగ్విన్‌లు ఉన్నాయని అంచనా. అందులో ఎంపరర్ పెంగ్విన్ పెద్దది. దీని ఎత్తు 3 - 1/2 అడుగులు, బరువు 80 పౌన్లు. ఇది చలికాలంలో పూర్తి చీకటిలో గ్రుడ్లు పెడుతుంది. .... మగ ఆడ పక్షులు ఒకేసారి ఎదురుగా నిలబడితే తేడా కనుక్కోవడం కష్టం. .... మగ పక్షులు సన్నని రాళ్ళను ముక్కుతో తీసుకొని వచ్చి ఎన్నుకొన్న ఆడపక్షి కాళ్ళ దగ్గర పెడతాయి. ఆడపక్షి ఒప్పుకునేటట్లయితే ఆ రాళ్ళను తన ముక్కుతో తీసుకొంటుంది.

—పియస్ శర్మా

'సైనిక సమాచార్'

## బంకిమ్ చంద్ర

దేశభక్తులకు, విజ్ఞాన సంపన్నులకు, మేధావులకు, కవి శ్రేష్ఠులకు, త్యాగధనులకు ఆలవాలమైన వంగభూమిలో 1838 జూన్ 26న ఇరవై నాలుగు పరగణాల జిల్లాలో కాంతల్‌పరా గ్రామంలో జన్మించాడు బంకిం చంద్రుడు. న్యాయశాస్త్రంలో

పట్టం పొందకముందే డెప్యూటీ కలెక్టరుగా నియమించ బడ్డాడు. అయినా aw లో మొదటి తరగతిలో 1869 లో ఉత్తీర్ణత సాధించాడు. మొదటి భార్యసంతాన రహితగా 1859 లో మరణించగా 1860 లో రాజ్యలక్ష్మీదేవిని వివాహమాడాడు. బంకింబాబు జీవితంపై రాజ్యలక్ష్మీదేవి ప్రభావం అమితంగా ఉంది. ఆయన నవలల్లో ఎన్నో పాత్రలపై ఆమె ఛాయ పడిందని చెప్పడానికి సంకోచింప నవసరం లేదు. తరువాత 1891లో ఉద్యోగ విరమణ చేసాడు. 1892లో ఆయనకు ఆంగ్ల ప్రభుత్వం రాయ్‌బహదూర్ బిరుదాన్ని, 1894 లో C. I. E. బిరుదాన్ని యిచ్చి సత్కరించింది. 1864 లో Indian Field పత్రికలో ఆంగ్ల రచనను సీరియల్‌గా ప్రచురించాడు. అదే సమయంలో ఆయన తొలి బెంగాలీ నవల "దుర్గేశ నందిని" వెలువడింది. కపాలకుండల, మృణాళిని, విషవృక్ష, ఇందిర, చంద్రశేఖర్ రజని, అనంద్ మఠ్ మొదలగు పద్నాలుగు నవలలు ఎన్నో వ్యాసములు వచ్చాయి.

—వి. రామకృష్ణరావు
'తెలుగు విద్యార్థి'లో

## సమైక్యత

ఈ అమ్మాయిలంతా టీనేజ్‌లో వున్నవారే. ఇంటర్మీడియట్ (ప్లస్‌టు) నుంచి పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేస్తున్న వారున్నారు. నీలిరంగు జీన్స్. గులాబీ రంగు షర్టు ధరించి హెల్మెట్ తో మోపెడ్లు నడుపుతూ వెళ్తుంటే దారి పొడవునా వీరు ప్రజల దృష్టిని ఆకర్షించడం సహజం. ఈ బృందంలో మొత్తం పదిహేను మంది అమ్మాయిలున్నప్పటికీ ఒకదఫా ఏడుగురు మాత్రమే మోపెడ్లపై స్వారీ చేస్తారు. రెండుబాచ్‌లుగా వున్న అమ్మాయిలు ప్రతి రెండు గంటలకో సారి మారతారు. వీరందరూ పశ్చిమ బెంగాల్‌కు చెందినవారే. బరద్వాన్ మహిళా విద్యాలయము చెందినవారు పదిమంది కాగా మిగతా నలుగురు విశ్వభారతి శాంతినికేతన్ నుంచి వచ్చారు. రోజూ ఎనిమిది గంటల చొప్పున ప్రయాణం చేస్తున్న వీరు గంటకు సుమారుగా ముప్పై అయిదు కిలోమీటర్ల వేగంలో వెళ్తున్నారు. సగటున రోజూ నూటయాభై కిలో మీటర్లు ప్రయాణం చేస్తున్నారు. ఈ నెల రోజులలో గమ్యస్థానం చేరడానికి మొత్తం నాలుగువేల కిలో మీటర్లూ.... వివిధ రాష్ట్రాల మీదుగా ప్రయాణం చెయ్యడం ద్వారా జాతీయ సమైకతా భావాన్ని పెంపొందించడం ఈ యాత్ర ప్రధాన ధ్యేయమని ఈ బృందం నాయకులు కర్నల్ శివరాజ్ చెప్పారు.

—వార్తా విశేషం
'సర్కార్ ఎక్స్‌ప్రెస్'

# మానవ ప్రగతి

## గాంధీ మందిరం

అక్టోబరు రెండున మహాత్మగాంధి 118 వ జయంతి సందర్భంగా అట్లాంటా (అమెరికా) లోని మార్టిన్ లూథర్ కింగ్ కేంద్రంలో గాంధి మందిరాన్ని పునరుద్ధరించారు. లూథర్‌కింగ్ కేంద్రానికి ఇదివరలో భారత ప్రభుత్వం మహాత్మగాంధి వినియోగించిన కొన్ని ముఖ్యమైన వ్యక్తిగత వస్తువులను, ఆయనకు సంబంధించిన మరికొన్ని జ్ఞాపక చిహ్నాలను అందజేసింది. భారత స్వాతంత్ర్యోద్యమం సమయంలో బ్రిటిష్ వస్త్రాల ఎగుమతి పరిశ్రమను ప్రతిష్టంభనకు గురిచేసిన చర్ఖా; ఇంకా ధోతీ, ఖాదర్, చేతికర్ర, గడియారం మొదలైనవి కూడా. అమెరికా పౌర హక్కుల ఉద్యమ నాయకుడైన కీర్తిశేషులు మార్టిన్ లూథర్‌కింగ్ మహాత్మగాంధి అహింసా సిద్ధాంతాన్ని అభిమానించారు. మార్టిన్ లూథర్‌కింగ్ కేంద్రంలోని గాంధి మందిరం పునరుద్ధరణ పూర్తయిన పిమ్మట అది అమెరికాలో గాంధి స్మృతి చిహ్నాలు గల మందిరాలన్నిటిలోకి అత్యధిక ప్రాధాన్యత గల మందిరంగా ప్రత్యేక స్థానం సంపాదించు కుంటుంది.

## 'హైపర్ సానిక్'

శబ్ద వేగానికి అయిదు రెట్లు అధిక వేగంతో ప్రయాణించగల ఒక అత్యాధునిక విమానం 2000 సంవత్సరం నాటికి తయారవుతుందని అమెరికన్ అధికారులు వెల్లడించారు. ఈ కొత్త కమర్షియల్ జెట్ విమానం 300 మంది ప్రయాణీకులను రెండు, లేదా మూడుగంటల వ్యవధిలో న్యూయార్కు నుంచి టోక్యోకు చేరవేస్తుందని, దాని శబ్ద తరంగాలు భూమికి ఏమాత్రం వినిపించనంతటి ఎక్కువ ఎత్తులో అది ఎగురుతుందని అమెరికన్ అధికారులు వివరించారు. యూరప్‌లోని ఉత్పత్తిదారులు, విలేకరులతో 'వరల్డ్ నెట్ టెలివిజన్ న్యూస్ కాన్ఫరెన్స్' లో ముచ్చటిస్తూ అమెరికన్ అధికారులు ఈ విషయాలు తెలియ జేశారు. లోగడ అమెరికా అధ్యక్షుడు రేగన్ దేశ ప్రజల నుద్దేశించి మాట్లాడుతూ 'ఓరియెంట్ ఎక్స్‌ప్రెస్' పేరిట ఒక

'హైపర్ సానిక్' విమానం రూపకల్పనకు మద్దతు ప్రకటించారు. ఆ ఏరోస్పేస్ విమానం ఒక మామూలు విమానాశ్రయంలోని 'రన్ వే' నుంచే గాలిలోకి ఎగర గలుగుతుందని గంటకు 27,000 కిలోమీటర్ల వేగంతో (శబ్ద వేగానికి సుమారు 25 రెట్లు) ప్రయాణిస్తుందని ప్రెసిడెంట్ రేగన్ అప్పట్లో అభిప్రాయ పడ్డారు. కాగా, ఇప్పుడు అమెరికా తలపెట్టిన అత్యాధునిక జెట్ విమానం ఇదివరలో ప్రెసిడెంట్ రేగన్ ప్రకటించిన 'ఏరోస్పేస్' విమాన నిర్మాణానికి తొలి మెట్టు అవుతుంది. ఈ జెట్ విమానం ఇప్పుడు నడుస్తున్న కంకార్డ్ సూపర్ సానిక్ విమానం కంటె రెండు రెట్లు ఎక్కువ వేగంతో ప్రయాణిస్తుంది. .... 32,000 అడుగుల ఎత్తు వరకు ఎగురుతుంది. ఇది లాస్ ఎంజిలిస్ నుంచి సిడ్నీకి, లేదా వాషింగ్టన్ నగరం నుంచి టోక్యోకి కేవలం రెండున్నర గంటల వ్యవధిలో చేరుకుంటుంది. ఇలా వుండగా ఈ అత్యాధునిక జెట్ విమానం నుంచి వెలువడే పొగ సూపర్ సానిక్ విమానాలు విడిచి పెట్టే పొగ కంటె తక్కువ వుంటుంది. కనుక ఈ విమానాల వల్ల భూమి వాతావరణం పైనగల 'ఓజోన్ పొర' కు తక్కువ హాని కలుగుతుంది. 'ఓజోన్ పొర' సూర్యుని నుంచి వెలువడే హానికరమైన అతి నీలలోహిత కిరణాల నుంచి భూమికి రక్షణ కల్పిస్తుంది.

## నయాగరా

అమెరికా, కెనడా సరిహద్దులోని జగద్విఖ్యాత 'నయాగరా' జలపాతం నేత్ర పర్వమైన తన 'అందచందాలతో' లక్షలాది మంది వినోద పర్యాటకులను ఆకర్షించడంతో పాటు న్యూయార్కు రాష్ట్ర ప్రజలకు ఏటా గణనీయమైన స్థాయిలో విద్యుచ్ఛక్తిని కూడా అందజేస్తున్నది. 'న్యూయార్కు పవర్ అథారిటీ'కి చెందిన 'నయాగరా విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు ప్రపంచంలోని అతి పెద్ద జల విద్యుత్ పథకాలలో ఒకటి కావడం గమనార్హం. 'నయాగరా' జలపాతంలో గంటకు సుమారు 1100 కోట్ల లీటర్ల నీరు క్రిందికి పడుతుంటుంది. ఈ జలపాతం వల్ల నీటి తుంపరలు వందలాది మీటర్ల ఎత్తుకు వ్యాపించి వెలుగుతో మిళితమై సుందర దృశ్యాలను సృష్టిస్తాయి. సెకనుకు 3,30,000 లీటర్ల వంతున క్రిందికి దుమికే 'నయాగరా' జల ధ్వనులు, దృశ్యాలు సందర్శకులను ఆశ్చర్యచకితుల్ని చేస్తుంటాయి. ఈ జలపాతానికి గల మహత్తరమైన శక్తి 24 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగలదు. ఈ విద్యుచ్ఛక్తి వల్ల 2 కోట్ల 40 లక్షల 100 వాట్ల బల్బులను ఒకేసారి వెలిగించవచ్చు. 'నయాగరా' జల విద్యుత్ ప్రాజెక్టు 1985లో 1 కోటి 70 లక్షల కిలోవాట్ అవర్స్ విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడం ద్వారా అమెరికాకు 2 కోట్ల 80 లక్షల పీపాల

ఆయిల్‌ను ఆదాచేసి పెట్టింది. ఈ నయాగరా విద్యుదుత్పాదన లేకపోతే 1985లో అమెరికాలో గృహ, పారిశ్రామిక వినియోగాలకు అంతటి (2 కోట్ల 80 లక్షల పీపాల) ఆయిల్ అదనంగా ఖర్చయ్యేది.

## సోలార్ ఎనర్జీ

సోలార్ సిస్టమ్ విషయానికొస్తే మెగావాట్ సైజ్ పవర్ యూనిట్లు సాంకేతికంగా మంచి ఫలితాలనిస్తున్నాయి. రానున్న కొద్ది సంవత్సరాల కాలంలోనే, సాంకేతిక ప్రగతిని మరింత ముందుకు తీసుకుపోయి సాంప్రదాయ విద్యుత్ కంటే కూడా తక్కువ ఖర్చుతో ఆర్థికంగా లభించే సోలార్ పి. వి. సిస్టమ్‌లను వాడకంలోనికి తేగలమనే నమ్మకం ఉంది. 30 మెగావాట్ల సోలార్ థర్మల్ పవర్ స్టేషన్ డిజైన్‌ను సాంప్రదాయేతర ఇంధన వనరుల విభాగం పూర్తి చేసింది. ఇంగ్లాండ్ వంటి అనేక విదేశాలలో ఈ స్టేషన్లు ఇపుడు ఎంతో చక్కగా పని చేస్తున్నాయి. సోలార్ థర్మల్ పవర్ ప్లాంట్లు నుండి విద్యుదుత్పత్తికి డీజల్ చేస్టే, థర్మల్ పవర్ ప్లాంట్లు నుండి విద్యుదుత్పత్తికి అయ్యే దానికంటే తక్కువగానే ఖర్చు ఉంటుంది. సోలార్ ఫోటో వోల్టాయిక్స్ విషయంలో కూడా సాంకేతిక అభివృద్ధి బల్క్ ప్రొడక్షన్ల ద్వారా ఖర్చు తగ్గించుకొనే వీలుంది. సోలార్ ఎనర్జీ ఆధారంగా నిర్మించే తొలి పైలట్ ప్లాంట్ ఏడవ ప్రణాళికలో చేపట్టబడుతుంది. ఆ తరువాత 8, 9 ప్రణాళికలలో వీటిని అధిక సంఖ్యలో నిర్మిస్తారు. ఈ శతాబ్దాంతానికి సౌర శక్తి ద్వారా 2,000 మెగావాట్ల విద్యుత్‌ను పొందగల్గాలనేది లక్ష్యంగా పెట్టుకోవడం జరిగింది. దేశంలోని విభిన్న ప్రాంతాలలో ఒక్కొక్కటి 2 మెగావాట్ల సామర్థ్యం గల లఘు జల విద్యుత్కేంద్రాలను నెలకొల్పి విద్యుత్‌ను ఆ రూపంలో పొందాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఇలాంటి లఘు జల విద్యుత్కేంద్రాల ద్వారా క్రీ. శ. 2001 నాటికి 2000 మెగావాట్ల విద్యుత్‌ను ఉత్పత్తి చేయాలనేది ప్రస్తుత లక్ష్యం. పరిశ్రమలు, వ్యవసాయ రంగం, సామాజిక సేవలు, గృహోపయోగాలకు కావలసిన ఇంధనాన్నంతటిని సోలార్ వాటర్ సిస్టమ్స్, సోలార్ ఎయిర్ డ్రైయ్యర్స్, సోలార్ స్టిల్స్, సోలార్ రిఫ్రిజిరేటర్లు, ఐస్, ప్యాక్‌లు, సోలార్ కుక్కర్ల వంటి సోలార్ థర్మల్ సిస్టమ్‌ల ద్వారా సరఫరా చేయవచ్చు. క్రీ. శ. 2001 నాటికి ఈ సోలార్ థర్మల్ సిస్టమ్ ద్వారా 20 మిలియన్ టన్నుల బొగ్గు వాడకాన్ని ఆదా చేయవచ్చునని అంచనా.



---

మా యిల్లు, మా దేశం అనడంలో ఒక అదృశ్యబంధం వుంది. ఎన్ని దేశాలు తిరిగినప్పటికీ జన్మభూమితో గల హృదయ సూత్రం తెలనిది, తెంపలేనిది. — ఎలిజా కుక్

# డైరీ

## 1987 అక్టోబరు 24

మరో కురుక్షేత్రం, ఇద్దరు కిలాడీలు వంటి చిత్రాలు నిర్మించిన భరద్వాజ ఈసారి శ్రీచరిత చిత్రావారి 'మన్మధ సామ్రాజ్యం' తనే డైరక్టు చేస్తున్నారు. స్వీయానుభవంలోని ఈ అయిదవ చిత్రంలో, శ్రీ దుర్గ, కిన్నెర, మీనా మరో యిద్దరు కొత్తవారు, మొత్తం అయిదుగురు కథా నాయికలు. నాయకుడు రఘు ద్విపాత్రాభినయం. నిర్మాత : వెంకటేశ్వరరావు. విశాఖపట్నం, హైదరాబాదు లొకేషనులలో, నవంబరు డిసెంబరు నెలల్లో ఒకే షెడ్యూల్లో పూర్తిజేయాలనుకుంటున్నారు.... పిఆర్ఒ ; సినీప్లాగ్ వెంకటేశ్వరరావు.

## 1987 నవంబరు 03

ప్రముఖ దర్శకులు విశ్వనాథ్ కుమారుడు చి॥ నాగేంద్రనాథ్‌కీ, విజయవాడకు చెందిన తెనాలి జగన్నాథరావు దంపతుల కుమార్తె సౌ॥ దుర్గావరలక్ష్మికి, విజయవాడ - బందరురోడ్డులోని తిరుమల తిరుపతి దేవస్థానంవారి కళ్యాణ మండపంలో నవంబరు ఒకటోతేదీ ఆదివారం ఉదయం 10గం॥ 58 ని॥లకు వేదోక్త విధులతో వివాహం జరిగింది; ఈ సాయంత్రం రాజేశ్వరీ కళ్యాణమండపంలో రిసెప్షన్ - మంజుభార్గవి డాన్సు - పూతరేకులతో విందు భోజనం. తెలుగుఫిలిమ్ పరిశ్రమ అంతా అక్కడే ఉంది. నూతన వధూవరులకు మా శుభాకాంక్షలు.

## . . . . . 08

రాణీ సీతయ్‌హాలులో జరిగిన గుత్తారామినీడు షష్ట్యబ్ది పూర్తి ఉత్సవానికి మాగంటి రవీంద్రనాథ్ స్వాగత వచనం చెప్పాక, అధ్యక్షత వహించిన డివియస్ రాజు, ఈ ఉత్తమదర్శకుడు తెలుగుసినిమా రంగంలో పునః ప్రవేశం గావించాలన్నారు. "రాసి కంటె వాసి ముఖ్యం - ఆయన దర్శకత్వం వహించినవి పన్నెండు పిక్చర్లే అయినప్పటికి, మా యింటి మహలక్ష్మి, చివరికి మిగిలేది, పల్నాటి యుద్ధం తెలుగుప్రజ మర్చిపోలేని చిత్రాలు. ఈ ఆదర్శవాది, అభ్యుదయగామి ఎందరో శిష్యులను తయారుచేశారు"- అన్నారు ఆంధ్రప్రదేశ్ సమాచార మంత్రి దాడి వీరభద్రరావు. తమ ప్రభుత్వం తెలుగు సినీ పరిశ్రమకు ఎన్నోవనరులు సమకూరుస్తున్నదనీ, సబ్సిడీ, టాక్స్‌రాయితీ, ఫిలిమ్‌కాలనీ నిర్మాణం - యిత్యాదులు చెప్పారు

ఆంధ్రప్రదేశ్ హోమ్‌శాఖామంత్రి శివప్రసాద్, ఉత్సవ కమిటీవారు, సన్మానపత్రం (కాకరాల చదివారు), నూతనవస్త్రాలు గుత్తా రామినీడు, పద్మాదంపతులకు ముఖ్య అతిథి యల్వీ ప్రసాద్ ద్వారా అందజేశారు. అనేకమంది మిత్రులు, అభిమానులు, ఆత్మీయులు - గుత్తారామినీడు దంపతులని పూలమాలలతో ముంచెత్తారు. మాదాల రంగారావు విప్లవాక్షర మాలతో అభినందించగా, కొండవీటి వెంకటకవి ఈ షష్ట్యబ్ది ఉత్సవం మరొక అరవైఏళ్ల కొత్త జీవితానికి నాంది - అన్నారు స్కాందపురాణ సందర్భం యయాతి చరితం చెబుతూ! "ఈ శతాబ్ది ఏభైలలో మన ప్రభుత్వం కమ్యూనిస్టులను వేటాడుతు న్నప్పుడు మా వంటివారిని గుట్టుగా దాచారు చాటపర్రులోని గుత్తావారు. అప్పట్లో మమ్మల్ని కాపాడినది ఆ కుటుంబమే! నిలువ నీడలేక ఎందరో యువకులు మద్రాసు వచ్చి తలదాచుకున్నారు. సినీరంగం వారికి ఆశ్రయమిచ్చింది. అందులో గుత్తా రామినీడు ఒకరు. రాజకీయంగా ఆంధ్రాలోని కమ్యూనిస్ట్ పార్టీ నష్టపోయిన మాటనిజమే! కాని, ఆ యువకులే తెలుగుసినిమాను జాగృతం చేశారు; కళాత్మకంగా యావదాంధ్రకు తమ అంతరంగ సందేశం వెల్లడించారు. రాజకీయ పరమైన నష్టం. సినీకళద్వారా భర్తీ అవటం మన కళ్లముందు జరిగిన చరిత్ర" అన్నారు సుప్రసిద్ధ ప్రజా నాయకులు మోటూరి హనుమంత రావు. "ప్రతి పురుషుని విజయం వెనక ఒక స్త్రీ ఉంటుందనే సూక్తి, మా పద్మ విషయంలో అక్షరాలా నిజం" - అన్నారు మోటూరి ఉదయం.... "పోలీసు దెబ్బలకు చలించని దయారసం, మానవగీతం, సౌందర్యదీపం మా రామినీడులో ఉండటం వల్లనే పల్నాటి యుద్ధం వంటి సందేశాత్మక చిత్రం తీయగలిగాడు. ఒక పిక్చర్ విజయమందితే ఆ ఘనత హీరోది. ఫెయిలైతే అందరూ ఆడిపోసుకొనేది దర్శకుని! ఈ వక్రదృష్టి మారితేగాని 'కృతజ్ఞత' కు అర్ధం తెలియని ఈ పరిశ్రమ బాగుపడదు"-అన్నారు సియస్ రావు. సభా నిర్వహణ: మురళీమోహన్. (లోని కివస్తూండగా, చాటపర్రువారి. దగ్గిర కూచుంటారా. ప్రెస్ వరస లోనా - అని అడిగారు విజయ బాపినీడు. చాటపర్రు గురించి ఏడెనిమిదేళ్ల వయసు జ్ఞాపకాలే తప్ప, ఆ తర్వాత తెలియదు. అది మా మాతామహుల ఊరు. స్వాతంత్ర్య పోరాటంనాటి పేర్లు - మాగంటి సీతారామదాసు, మాగంటి అన్నపూర్ణాదేవి, మాగంటి బాపినీడు వంటివి - మా పిన్నిగారు చెబుతూండేవారు - గాడేపల్లి మంగమ్మగారు. ఆమె జైలుకి వెళ్లలేదుగాని చాలాకాలం ఖద్దరు కట్టారు. ఆ ఊరు ఆంజనేయస్వామి గుడి, కోనేరు - చిన్ననాటి జ్ఞాపకాలు. ఆలయ స్థాపకులు ధర్మకర్త మా మేనమామ - సుసర్ల కృష్ణమూర్తిగారు. వారెవరూ

ఇప్పుడు లేరు. ఏడాది క్రితం ఒకసారి మురళీమోహన్‌ని అడిగాను; ఆంజనేయస్వామి గుడి ఎలావుంది ? - అని ! పునరుద్ధరణకు ప్రయత్నం చేస్తున్నామన్నారు.... మానాన్నగారు ఉద్యోగ రీత్యా బరంపురం, శ్రీకాకుళం, తుని ప్రాంతాల ఉన్నప్పుడు, సెలవలకి ఏలూరువచ్చి, అక్కడ మరొక మేనమామగారింట్లో బసచేసి, ఒంటెద్దు బండిమీద చాటపర్రు వెళ్లి, ఒకరోజు వుండేవాళ్లం. మేనమామ కృష్ణమూర్తి గారు తప్ప మిగతా బంధువులందరూ పక్క పట్నమైన ఏలూరుకితరలి వచ్చేశారు అప్పటికే ! చాటపర్రులోనే మా తలిదండ్రుల వివాహం జరిగింది. ఇదంతా 'నొస్టాలియా' కావచ్చు - కాని, అప్పుడప్పుడు మనస్సు వెనక్కి పరుగెత్తి, ఊరట పొందుతూండటం సహజం)

. . . . . 09

ఈ పత్రికకు గత పాతికేళ్లగా బొకులు చేస్తున్న దయానంద్, సుమారు ఇరవైఏళ్ల క్రితం తన పెళ్లి శుభలేఖ తీసుకువచ్చి యిచ్చాడు. పది పన్నెండురోజుల క్రితం రాత్రి తొమ్మిదిన్నర గంటలవేళ, స్వయంగా తీసుకువచ్చి యిచ్చాడు, తన కుమార్తె పెళ్లి శుభలేఖ ఒక మనిషి కష్టపడి పైకి రావడమనేది దయానంద్ వంటి వారిలో చూడగలుగుతాము. మధ్యాహ్నంపన్నెండుగంటలకిడిజైను పంపి, 'దయానంద్, యిదిఅర్జంటుగా నాలుగు గంటలకి కావాలి' అంటే, 'మూడున్నరకి మనిషిని పంపండి, సార్' అంటూ చేసి యిచ్చిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. ఇక్కడ డబ్బుకాదు ముఖ్యం - తనదైన పని పట్ల ఏకోన్ముఖ లక్ష్యం. దయానంద మొదలియార్ కుమార్తె భవాని బిఎ పాసయింది; అల్లుడు రాజ్‌కుమార్ బిఇ - యమ్‌బిఎ - హొసూరులోని కొఠారీ ఎలక్ట్రానిక్స్‌లో పనిచేస్తున్నాడు. ఈ ఉదయం పదిగంటలకు చెట్‌పట్‌లోని 'కుచేలాంబాళ్ కళ్యాణ మహల్'లో చి॥ రాజకుమార్‌కి, సౌ భవానికి శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. నవదాంపతులకు మాశుభాభినందనలు. . . . . . విద్వాన్ విశ్వం, దాశరథి, తుమ్మల వెంకట్రామయ్య– తెలుగు సాహితీలోకానికి, తెలుగు పత్రికా ప్రపంచానికి సన్నిహితులైన ముగ్గురు మహనీయులు మూడు వారాల వ్యవధిలో తెరవెనక్కి తప్పుకున్నారు. విద్వాన్ విశ్వం ఆంధ్రప్రభ వీక్లీ సంపాదకునిగా మాణిక్యవీణా ధరునిగా, దాశరథి కోటి రతనాల వీణతో తిమిరంతో సమరం జరిపిన కవి చంద్రునిగా, తుమ్మల వెంకట్రామయ్య సిద్ధాంత న్యాయానికి సమాజ ప్రగతికి కట్టుబడి నడిచేదే ఫలవంతమగు జీవితమని కాలానికి పదును పెట్టినఖడ్గధారిలా తెలుగు పాఠక లోకాన్ని చైతన్యవంతం చేసిన ధీరులు, బుధులు, సన్మిత్రులు, సహృదయులూను. ఈ ముగ్గురిలో ఒకొక్కరి గురించి ఒకొక్క పుస్తకం రాయవచ్చు. కాని, రాసే

దెవరు, వేసేదెవరు, చదివేదెవరు? పరుగులే తప్ప ఎటు పరుగెడుతున్నాం, దేనికోసం పరిగెడుతున్నాం?- అనేది మర్చిపోతున్నాం.... ఈ ముగ్గురి స్మృత్యర్థం, 'రచన' (కన్వీనరు: బియస్సార్ కృష్ణ) పొట్టి శ్రీరాములు హాలులో సంతాపసభ జరిపింది. దివంగతుల గౌరవార్థం ఒక నిముషంపాటు మౌనం పాటించాక, కృష్ణమూర్తి విద్వాన్ విశ్వం జీవిత విశేషాలు తెలిపారు. 'స్పందన గల డెందమే కవిత పలుకుతుంది, రాయలసీమ నుంచి మాణిక్యవీణ, తెలంగాణానుంచి రుద్రవీణ, తెలుగు కవితాసీమను రాగడోలికలో ఊగించాయి. కవి పండితుడైన విశ్వంగారు గురుతుల్యులు, మూర్తిలో వామనుడైనా కీర్తిలో త్రివిక్రముడైన దాశరది స్నేహశీలి' - అన్నారు పప్పు వేణుగోపాలరావు. ఆంధ్రప్రభ వీక్లీ ఎడిటర్‌గా విద్వాన్ విశ్వం తెలుగు రచయిత్రులకు ఎటువంటి మహదవకాశం యిచ్చినదీ ఎందరు రచయిత్రులు వెలుగులోకి వచ్చినదీ చెప్పారు మాలతీచందూర్... "విద్వాన్ విశ్వం తిరుచునాపల్లి జైలులో నావద్ద బెంగాలీ నేర్చుకున్నారు. దాశరధీ నేనూ కేంద్ర సాహిత్య అకాడమీలో చాలాసంవత్సరాలుగా ఉంటున్నాము. సాహితీపరులిరువురూ నాకెంతో కావలసినవారు. విశ్వంగారుసంస్కృతంనుంచి తెలుగులోకి తెచ్చిన వచన రచనలునాకెంతో యిష్టం; అలాగే దాశరధి గాలిబ్ గీతాలు — ఉదూనుంచి.... ఈ యిద్దగా తన కవితలు మనకు మిగిల్చి వెళ్ళిపోయారు.... తెలిసినవారొక్కరొక్కరే జారిపోతూవుంటే భాధగా ఉంటుంది," - అన్నారు అధ్యక్షత వహించిన డా॥ బెజవాడ గోపాలరెడ్డి. మల్లెమాల యమ్మెస్‌రెడ్డి, దాశరధి గురించి వ్రాసిన కవిత చదివారు. ముగ్గురూ అభ్యుదయ రచయితలనీ, అభ్యుదయ సాహిత్యానికి అంకితమైనవారనీ అన్నారు మల్లిక్.

. . . . . 14

'రా' అంటే రాముడు, 'కి' అంటే కృష్ణుడు - రెండూ కలిపాను రాకీ అయ్యాను - అంటాడు కొత్తహీరో శ్రీరామ్‌కుమార్, జయప్రదా వారి 'రాకీ' చిత్రంలో తనని తాను పరిచయం చేసుకుంటూ! హీరోయిన్ సుపర్ణ ఆరబోసుకున్న అందానికి, అతని కుర్రపాయం అవురావురంటుంది. విధి ఆటలకు ఎడబాటులకు ఇక లొంగమని, జత విడమని, మోటారుసైకిలు మీద ఎదురు బదురుగా కూచుని బాసలు చేసుకుంటారు. పినియన్ మీద కూచోడం పాత పద్ధతి - ఇది నవీన రొమాన్స్. ఈ చిత్రంలోని డిస్కో సాంగ్ (వేటూరి) తప్ప మిగతావన్నీ ఆత్రేయరాసినవి. సంభాషణలు గణేష్ పాత్రో. 'బాధని పంచుకొన్నవారే బంధువులు - పూలలాంటి కన్నులలో ముళ్లదాచుకున్నాను' - అంటూ జయప్రద అభినయిస్తూ పాడిన పాట, గుండెలోతుల్ని గుబగబలాడిసుంది - కరుణారసంతో!

మిగతావన్నీ నేటి వేగానికి అనువుగా యాక్షన్ పాటలు. స్విమ్మింగ్ డ్రస్ లోని సుపర్ణ హీరోతోబాటు వర్షంలో తడిసీ, నీటిలో మునిగీ, పసరికమీద దొర్లీ, తన వంటి వంపుల ప్రదర్శనలో ప్రబంధ నాయికలను మించిపోతుంది. తమ్ముడు హీరో అయితే అన్నగారైన రాజ్‌బాబు విలన్. ఇవ్వాళ 'గుడ్‌లక్' లో పాటలు మాత్రమే చూపారు - మొత్తం పిక్చరు పదిపదిహేను రోజులలో చూపిస్తామన్నారు. ముఖ్యులతో బాటు నూతన్ ప్రసాద్, రంగనాథ్, కోట శ్రీనివాసరావు, రామకృష్ణ, పియల్ నారాయణ, కెఆర్ విజయ, రమాప్రభ మున్నగువారున్నారు. నిర్మాతలు : నీలవేణి క్రిష్ణ, సౌందర్య. దర్శకత్వం : చంద్రశేఖరరెడ్డి.

. . . . . 15

స్వామీ శంకర్‌దాస్ ఆడిటోరియమ్‌లో, ఆంధ్ర ప్రభుత్వ ఆరోగ్య మంత్రి వెంకటేశ్వరరావుముఖ్యఅతిథిగా, చలనచిత్ర పరిశ్రమకు భీష్మాచార్యులైన యల్వి ప్రసాద్ అధ్యక్షులుగా, మద్రాసులోని తెలుగు ఫిలిమ్ పత్రికా రచయితల సంఘం తెలుగు ఫిలిమ్ జర్నలిజమ్‌కు స్వర్ణోత్సవం జరిపింది. 'ఏభైఏళ్లు నిండిన ఈ పత్రికా రచయితకు (అంటే ఫిలిమ్ జర్నలిస్ట్‌కు) మీ దీవెనలు అందజేయండి' అనే అభ్యర్థనే తప్ప, కార్యక్రమ వివరాలేమీ లేవు ఆహ్వానలేఖలో ! అయితే, అదొక కొత్త పద్ధతి. కార్యకర్తలందరూ ఎంతో ఉత్సాహవంతగా పనిచేసి, ఫిలిమ్ పరిశ్రమలోని పెద్దలెందరినో తమ సత్కారం ందుకొనేందుకు వేదిక మీదకు రప్పించారు. శతదినోత్సవాలలోకి మల్లే ఒక ప్రముఖుని మరొక ప్రముఖునిచేత సత్కరింపజేశారు. యల్వి ప్రసాద్, మంత్రి వెంకటేశ్వరరావులతో బాటు డివియస్ రాజు, యమ్మెస్ రెడ్డి, సియస్ రావు, అంజలీ అదినారాయణ రావు దంపతులు, కమలాకర కామేశ్వరరావు, ఇంటూరి వెంకటేశ్వరరావు, గొల్లపూడి మారుతీరావు మున్నగువారు వేదిక మీద ఆశీనులయారు. తెలుగు చిత్ర పరిశ్రమలోని ప్రముఖులని, సభలో వున్న మరికొందరు ప్రముఖుల ద్వారా (కోదండరామిరెడ్డి, గోపాలరెడ్డి, చిరంజీవి, నూతన్ ప్రసాద్ మున్నుగువారు), సత్కరింపజేశారు. అలాగే సీనియర్ జర్నలిస్టులైన ఇంటూరి వెంకటేశ్వరావు, బొమ్మకంటి సుబ్బారావు, శ్రీనివాస్, కొమ్మూరి సాంబశివరావు, కాగడా శర్మ మున్నగువారిని సత్కరించారు. వక్తలలో జర్నలిజమ్ గురించి పరిశీలనాత్మకంగా నాలుగు మాటలు చెప్పినది గొల్లపూడి మారుతీరావు ఒక్కరే ! (ఏడున్నరకి నేనువచ్చేశాను - ఆతర్వాత ఎవరైనా మాటాడారేమో తెలీదు.) సభా నిర్వహణ : మురళీమోహన్ శతదినోత్సవాల వరవడిలో జరిగినప్పటికీ, ఈ స్వర్ణోత్సవాన్ని యింత ఆనందదాయకంగా జయప్రదంగా నిర్వహించిన అర్జునరావు, జగదీష్‌బాబు, పసుపులేటి రామారావు, రాజు, ఉమామహేశ్వరరావులకు, కార్యవర్గ సభ్యు

లకు (ఈశ్వర్ నారాయణవర్మ, జగన్మోహన్, కౌండిన్య, జగన్, నారాయణరావు, రామచంద్రరెడ్డి, దేమూరి సత్యనారాయణ) మా మనఃపూర్వక అభినందనలు.... (ఫిలిమ్ జర్నలిస్ట్‌ది వృత్తి ధర్మంతో కూడిన సామాజిక బాధ్యత ; ప్రొడ్యూసర్‌కి సామాజిక బాధ్యత లేకపోలేదు గాని వ్యాపార ధర్మం ప్రధానం. మొదట తను నిలబడాలి. ఈ యిరువురి దృక్పథంలోను కొంతమేర వైవిధ్యం తప్పనిసరిగా ఉంటుంది. పరస్పర అవగాహన నుంచే ఫిలిమ్ జర్నలిజమ్ ఊపిరి పోసుకుంటోంది. ఆ సదవగాహన పెంచేందుకు, ఫిలిమ్ పరిశ్రమ నుంచి ముగ్గురుతో కూడిన సెమినార్ - పేపరు చదవడం, ఆపైన హేతుబద్ధమగు చర్చ – జరిపివుంటే ప్రయోజనాత్మకంగా ఉండేది ; ఆ ప్రసంగ పాఠాలతో కూడిన సావనీర్ జర్నలిస్టుల కృషికి ఒక మైలురాయిలా నిలిచివుండేది. అయితే, అనేకానేక పరిమితులు, ఎన్నో అనుకుంటాం - అనుకున్నవన్నీ ఆచరణలో పెట్టలేము)........ సు రే ష్ వా రి 'రాము' చిత్రం 22 కేంద్రాలలో - (విజయవాడ – శకుంతల ; గుంటూరు- భాస్కర్ ; తెనాలి – గెయిటీ ; ఒంగోలు - సురేష్ ; ఏలూరు - కల్పనా ; భీమవరం - వెంకట్రామా ; హైదరాబాదు - శాంతి ; వరంగల్ – నవీన్ ; నిజామాబాద్ - నటరాజ్ ; సోమిడి - వెంకట్రామ్ ; నెల్లూరు – వినాయక ; తిరుపతి - ప్రతాప్ ; అనంతపురం - త్రివేణి ; కర్నూలు - రాధాకృష్ణ ; కడప - అమీర్ ; హిందుపురం - బాలాజీ ; వైజాగ్ - పూర్ణా ; శ్రీకాకుళం - అంజనేయ ; అనకాపల్లి - జగన్నాథ్ ; రాజమండ్రి - అశోక్ ; కాకినాడ - గీత్ ; అమలాపురం - రామా) ఆడిన సందర్భంగా 'తాజ్'లో యివ్వాళ శతదినోత్సవ వేడుక. బాలకృష్ణ కథానాయకుడు, రజని నాయిక. గుహనాధన్ కథ, వై నాగేశ్వరరావు దర్శకత్వం.... ఈనాటి ముఖ్య అతిధిగావిచ్చేసిన శివాజీగణేశన్ ద్వారా, ఆంధ్ర ముఖ్యమంత్రి సహాయక నిధికి (విద్యాలయ నిర్మాణానికి) ఒక లక్షరూపాయిల విరాళ మందజేశారు నిర్మాత రామానాయుడు.

. . . . . 18

తండ్రిగారి షష్టిపూర్తి ఉత్సవానికి కొడుకులిద్దరూ— వెంకట్రావు, కృష్ణారావు - పూనుకొన్నారు ; ఎంతో ఆనందప్రదంగా జరిపించారు. మిత్రజనబాంధవుడైన రమణయ్య రాజాకు శుభాకాంక్షలు తెలిపేందుకు, ఎక్కడెక్కడివారూ ఈ సందర్భంగా సమావేశమయారు. ఉదయం పూట సంప్రదాయబద్ధంగా వేదోక్త విధులతో పూజా కార్యక్రమం ; సాయింత్రం దీపతోరణాల మధ్య, చిరునవ్వుల వెలుగులూ పరస్పర పలకరింపులతో స్నేహలతానికుంజంలో విందుభోజనం .... ఎంతో దగ్గిరవారి గురించి ఎక్కువ మాటలు చెప్పకూడదు....

రాజాలక్ష్మి దంపతులకు మా శుభాభి నందనలు.

. . . . . 19

రాణీసీతయ్ హాలులో రాజాలక్ష్మి ఫౌండేషన్ వారి సత్కార సభ. పద్మ భూషణ్ డి రామ్మూర్తి - ప్రపంచ ప్రఖ్యాత న్యూరోసర్జన్ - ఈ సంవత్సరపు అవార్డ్ గ్రహీత. (ఇరవైవేలు నగదు - డాక్టర్స్ కెవి రావు, జ్యోతి రావుల స్పాన్సరింగ్‌లో రెండువారాల అమెరికా పర్యటన). కళాప్రపూర్ణ రావూరి భరద్వాజకు ఈ సంవత్సరం నుంచీ కొత్తగా ప్రారంభించిన సాహిత్య సత్కారం (అయిదు వేలు నగదు). అధ్యక్షత వహించవలసిన బీహారు గవర్నరు పెండేకంటి వెంకట సుబ్బయ్య రాలేకపోయిన కారణాన, ముఖ్యఅతిథి జలగం వెంగళరావు - కేంద్ర పరిశ్రమల మంత్రి - ప్రారంభకులుగాను, అధ్యక్షులుగాను వ్యవహరించారు. వారితోబాటు వేదిక నలంకరించినవారు: పూజ్యులు గోపాలరెడ్డి, బెజవాడ ఫిజిషియన్ సివి కృష్ణస్వామి, విశాఖ మేయరు డివి సుబ్బారావు, 'వుడా' ఛెయిర్‌మాన్ యమ్ వివియస్ మూర్తి, హిందూస్థాన్ ఛాంబర్ అధ్యక్షులు అశోక్‌కుంభట్, చెన్నపురి ఆంధ్రమహా సభ అధ్యక్షులు జెవి సోమయాజులు, ఇందుకోసం ప్రత్యేకంగా అమెరికా నుంచి వచ్చిన డాక్టర్స్ కెవి రావు, జ్యోతీరావు ధంపతులు .... రమణయ్యరాజా కుమారై డా॥ కాంతామణీ సుందర్ అహూతులకు స్వాగతం తెలుపగా, కుమారులు వెంకట్రావు, కృష్ణారావు, వేదికపై ఆశీనులైన వారిని మాలలతో గౌరవించారు. ఆంధ్రా యూనివర్సిటీ ప్రొఫెసర్ ప్రసన్నకుమార్ సభా కార్యక్రమం నిర్వహించారు. రమణయ్యరాజా షష్ట్యబ్దిపూర్తి, రాజాలక్ష్మి సత్కారవేదిక ఒకదానితో ఒకటి సమ్మిళితమయాయి. న్యూరో సర్జన్ రామ్మూర్తిని రాజాలక్ష్మి ఫౌండేషన్ తరఫున జలగం సత్కరించారు; భరద్వాజను గోపాలరెడ్డి. కెకెషా మద్రాసులో గవర్నరుగా ఉన్నప్పుడు తిరుపతి యోగా ఇన్‌స్టిట్యూట్ స్థాపనలో రామ్మూర్తి పాత్ర గురించి జలగం వెంగళరావు చెప్పారు. ఎనభై ఏళ్లు నిండిన తాము, వైద్య సంప్రదింపుకై ఏనాడూ రామ్మూర్తి వద్దకు వెళ్లలేదనీ, మిత్రులు జానకిరామ్ బావమరిదిగా, ఆచంట లక్ష్మీపతి (రుక్మిణమ్మ) కుమారులుగా తమకు తెలుసుననీ, ఇక భరద్వాజ జీవన సమరంలోని నిరుపేదల బ్రతుకులకు అక్షర రూప మిచ్చారనీ అన్నారు గోపాల రెడ్డి. సత్కార గ్రహీత లిరువురూ సముచితరీతిని సమాధానం చెప్పారు. కృష్ణారావు వందన సమర్పణతో సభ ముగిసింది.

. . . . . 21

శుభోదయా ఆర్ట్‌వారి 'దొంగగారూ స్వాగతం' పాటలు ప్రదర్శన యమ్మెమ్ థియేటర్‌లో. పాటలన్నీ వేటూరి సుందరరామ్మూర్తివి; సంగీ

తం : చక్రవర్తి. 'దొల్లుపుచ్చకాయలా' దొర్లిస్తానంటాడు కృష్ణ, ఢిల్లీ కజ్జకాయలాంటి విజయశాంతిని (రాజ్ సీతారామ్ - జానకి). వారిద్దరి నేపథ్య గానంలోనే 'దూరం దూరం' అంటుంది విజయశాంతి కథానాయకుని మరింత కవ్విస్తూ. రామ్మోహనరావు దర్శకత్వంలో, వై. సత్యనారాయణ నిర్మిస్తున్న ఈ చిత్రంలోని అయిదు పాటలూ (మిగతా మూడు: ఊయలా ఊయలా, ఒకె వేసుకో, నా గుట్టునే) వలపు గీతికలై, స్టెప్స్‌తో కూడిన సరస శృంగార వేడుకని చూపుతున్నాయి.

. . . . . 22

'లాయర్ భారతీదేవి'తో, తెలుగు సినీ జగత్తులో ప్రవేశించిన 'గార్మెంట్స్ ఎక్స్‌పోర్టర్' జి కె రెడ్డి (శ్రీదేవి కళా చిత్ర), జానకీదేవి సమర్పణలో (శ్రీదేవి కళా ఆర్ట్స్) 'డాన్స్ రాజా డాన్స్' అనే కన్నడ చిత్రాన్ని తెలుగులోకి అనువదిస్తున్నారు. 'ఓం న మ శ్శి వా య' స్మరిస్తూ, జగమంతా వెతికినా శాంతి కనపడటం లేదనే, కథానాయకుడు వినోద్‌రాజాకు, (ఒకనాటి ప్రముఖ తార లీలావతి కుమారుడు - 'మరోమలుపు'), యిది ప్రథమ చిత్రం. నేపథ్య గాయకుడవుదామనుకొన్న ఈ యువకుడు, నాట్య కళావతంసు డయాడు 'సంగీతమే గా నా జీవం' అనే హీరో, ఆటా పాటాతో పొట్ట పోసుకుంటున్న ధోరణి కనిపిస్తున్నది — 'దేవి శ్రీదేవి'లో చూపిన పాటల్ని బట్టి! మొత్తం ఆరు పాటలు. 'నీవు వీణవు నేను తీగను' - అని అభినందిస్తాడు నాయికని.... 38 పిక్చర్లు తీసిన ప్రముఖ కన్నడ దర్శక నిర్మాత ద్వారకేష్, ప్రేక్షకాభిరుచిని బట్టి చిత్ర విజయం ఉంటుందనీ, ఎంతటి వారికీ అది తెలుసుకోవడం సాధ్యంగాని విషయమనీ అన్నారు — శ్రీ కళావారి ఆఫీసులో! 320 చిత్రాలకు పైగా డబ్బింగ్ చేసిన రాజశ్రీ, తమిళంకంటె కన్నడంలో నుంచి డబ్ చేయటం కష్టతరమనీ, 'లిప్ మువ్‌మెంట్ సింక్రొనైజేషన్'కి అనువైన పదాలు వెతుక్కోవలసి వస్తుందనీ అన్నారు. మద్రాసు తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్ బిల్డింగ్ ఫండ్‌కి నిర్మాత జి కె రెడ్డి వెయ్యి న్నూటపదహార్లు విరాళంగా యిచ్చారు.

1987 నవంబరు 26

విజయావాహినీ అధినేత నాగిరెడ్డి మనుమరాలు (వే ణు గో పా ల రెడ్డి కుమార్తె) సౌ॥ లక్ష్మీనిరుపమకు, రాఘవరెడ్డి కుమారుడు చి॥ సురేష్ రెడ్డికి ఈ ఉదయం పదిగంటలవేళ విజయా శేష్ మహల్‌లో శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. ఉదయం ముహూర్తానికీ, సాయింత్రం రిసెప్షన్‌కీ బంధుమిత్రులనేకులు వచ్చి నూతన వధూవరులకు శుభాకాంక్షలు తెలిపారు.

. . . . 30

మొనా యాక్టర్ చంద్రశేఖరం మనుమరాలు (నాగరాజ్ దంపతుల కుమార్తె) సౌ॥ అరుణజ్యోతికీ, బాలకృష్ణ దంపతుల కుమారుడు చి॥

ప్రసాద్‌కీ ఈ ఉదయం ధనుర్లగ్నంలో ఎతిరాజ్ కళ్యాణ నిలయంలో వివాహం జరిగింది. సాయంత్రం బాలకృష్ణ ప్రసాద్ మ్యూజిక్. రెండు పూట్లా బంధుమిత్రులనేకులు వచ్చి నూతన దంపతులకు శుభాభినందనలు తెలిపారు ....నవంబరు 30 నుంచి డిసెంబరు 13 దాకా లలితకళా అకాడమీ ఆర్ట్ గాలరీలో నిర్వహించే సాహిత్య అకాడమీ పుస్తక ప్రదర్శనకు, ఉదయం పదకొండు గంటలకి ప్రారంభోత్సవం. ఇరవై నాలుగు భాషలలోని విలువైన పుస్తకాలు అతి తక్కువ ధరలకి యిస్తున్నారు. సాహిత్యపరంగా జాతీయసమైక్యతా దృష్టితో నిర్వహింపబడుతున్న సంస్థలు రెండే రెండు కనిపిస్తున్నాయి. ఒకటి : సాహిత్యఅకాడమి; రెండోది: నేషనల్ బుక్‌ట్రస్ట్. వైవిధ్యం లోని ఏకత్వమనే దానిని వేదికమీద చిలక పలుకులా గాక, క్రియాశీలకంగా కృషి చేస్తున్నది కేంద్ర సాహిత్య అకాడమీ. ఏ ప్రాంతానికా ప్రాంతం చిరులు గీసుకు కూచోవడంగాక, నవ సాహిత్య నిర్మాతల గురించి తెలుసుకోవలిసిన తరుణమిది. 'ఇండియన్ లిటరేచర్ అంతా ఒకటే - కాని, అది వేరు వేరు భాషలలో వ్యక్తమవుతూంటుంది' - అని చెప్పిన రాధాకృష్ణన్ మాటలు విస్మరింపరానివి.

## 1987 డిసెంబరు 01

టి నగర్ రామకృష్ణ గ్రవుండ్స్‌లో ఆడుతున్న క్రికెట్‌లో కళ్యాణ చక్రవర్తి సెంచరీ కొట్టడం చెవిసి మూవీస్‌వారి 'ప్రేమకిరీటం'లో ఒక రసవద్ఘట్టం. అందమైన అబ్బాయి చుట్టూ అమ్మాయిలు చేరడం సహజం కథ ! పద్మావతి నిర్మాతగా శంభూ ప్రసాద్ సమర్పిస్తున్న ఈ చిత్రంలో, మురళీ మోహన్, చంద్రమోహన్, జగ్గయ్య, గుమ్మడి, వేలు, వీరభద్రరావు, షావుకార్ జానకి, కుష్బు, అశ్విని, తులసి, శ్రీలక్ష్మి మున్నగువారున్నారు. కథా రచన, చిత్రానువాదం : పాటిబండ్ల విజయలక్ష్మి. మాటలు ; కాశీ విశ్వనాథ్. మహదేవన్ సంగీతం, నవకాంత్ కెమెరా. దర్శకత్వం : రామ్మోహనరావు క్రికెట్‌సీన్ అయాక, నిర్మాతగారింట్లో లంచ్. భోజనానంతం కబుర్లు ఆయి, ఇల్లు చేరుకొనేసరికి మూడున్నర.... టీ త్రాగి, ఉత్తరాలు చూసి, బట్టలు మార్చుకు, అండాళ్‌తో 'పుష్పక విమానాని'కి.

## 1987 డిసెంబరు 02

కెన్నమరా బిన్నీరూమ్‌లో, ఐసిసి ఆర్ వారి (Indian Council for Cultural Relations) ప్రెస్ కాన్ఫరెన్స్. 1987 నవంబరు 21వ తేదీన 'సోవియట్ ఫెస్టివల్' కి ఢిల్లీలో ప్రారంభోత్సవం జరిగింది. టివి నెట్ వర్క్‌లో చాలామంది ఆ ఉత్సవ విశేషాలు వీక్షించివుంటారు. ఫెస్టివల్ బృందంలోని కొందరు ఈ డిసెంబరులో మద్రాసు వస్తున్నారు ఐసిసిఆర్ డైరక్టర్ జనరల్ లలిత్ మాన్‌సింగ్, స్థానిక డైరక్టర్ వాసుదేవన్, మద్రాసులోని సోవియట్

కౌన్సల్ జనరల్, మ్యూజిక్ అకాడమీ టిటి వాసు, అవ్వయ్ నటరాజన్ మద్రాసులో జరిగే ఉత్సవం గురించిన వివరాలు తెలిపారు. పదమూడు పద్నాలుగు తేదీలలో మ్యూజిక్ అకాడమీలోను, 27వ తేదీనుంచి నాలుగు రోజులపాటు కలైవానార్ లోను సంగీత నృత్య ప్రదర్శనలు ఉంటాయి నూటఏభై మంది కళా కారులు పాల్గొంటారు మ్యూజిక్ అకాడిమీలో ప్రదర్శించే జానపద నృత్యంలో. 257 మంది సభ్యులు గల 'బొల్షాయ్ థియేటర్' మొదటి సారిగా దేశం వెలుపల ఇచ్చిన ప్రదర్శన ఇండియాలో! ఢిల్లీలో 10, బొంబయిలో 9, బెంగుళూరులో 5, కలకత్తాలో 14 ప్రదర్శనలు యిస్తోంది బొల్షాయ్. జానపద నృత్య ప్రదర్శనలు ఢిల్లీలో 2, చండిఘర్‌లో 3, బొంబయిలో 4, మద్రాసులో 2, బెంగుళూరులో 3, హైదరాబాదులో 3, కలకత్తాలో 3.... ఇరవైమంది సభ్యులు గల పప్పెట్ థియేటర్, 140 మంది గల సర్కస్, యువతీ యువకుల పాప్ మ్యూజిక్, ఎగ్జిబిషనులూ, ఫిలిమ్ షోనూ - 1988 నవంబరు నెలాఖరు దాకా, ఒక సంవత్సరంపాటు భారత దేశంలోని వివిధ నగరాలలో ఈ సాంస్కృతికోత్సవం భారీఎత్తున జరుగుతుంది. కళల ద్వారా తమ సంస్కృతిని వ్యాప్తంచేస్తూ, పరస్పర మైత్రీ బంధానికి కృషి చేయడం నేటి ప్రగతిలో ఒక నూతనాధ్యాయం.

— యన్నార్ చందూర్

# కొత్త పుస్తకాలు

"స్త్రీలపాటలు - పెళ్ళిపాటలు" - సంకలనం : 'కళాప్రపూర్ణ' డాక్టర్. ఎ. అనసూయాదేవి (వింజమూరి) ప్రకాశకురాలు : డా. ఎ. అనసూయాదేవి ; ప్రతులకు : A/1 - 12 క్రాస్‌స్ట్రీట్, బిసెంట్ నగర్, మద్రాసు - 600 090 వెల : రు. 40-00.

బాపు వేసిన 'సీతారాముల కల్యాణం' ముఖచిత్రంతో ముచ్చటగా అలంకరించుకొని పెళ్ళికళలు వుట్టిపడుతూ వుంది యీ పుస్తకం. తెరచి చూస్తే సరస వినోదమైన పాటలు. పాడుకోదలిచిన వారికి స్వరాలు అమర్చి తయారుగా వున్నాయి.

ఆంధ్రదేశంలో జానపదగీతాలంటే గుర్తు వచ్చేది సీత, అనసూయలే. అనసూయాదేవి యింతకు మునుపు "కృష్ణశాస్త్రి కృతులు", "జానపద గేయాలు" రాగ స్వరబద్ధంచేసి ప్రచురించారు. ఈ ప్రచురణ "స్త్రీలపాటలు" అనే శీర్షికతో ప్రచురించదలిచిన, మూడింటిలో మొదటిది.

వియ్యాలవారిని ఎత్తిపొడుస్తూ "వచ్చిరమ్మా వియ్యాలవారు అచ్చమైన మర్కటముల బారు" అంటూ ఒక పక్కన మర్యాదలు చేస్తూనే యిట్లా వేళాకోళం చేసేవారు కాబోలు ఆ రోజుల్లో ! ఈ ఎత్తిపొడుపుల్లో తరువాత స్థానం వదినెది.

"వదినెకు నలుగు
మంచి నూనె మడ్డితో, మరిగేటి తారుతో, సీమ సింతాకుతో, సీమ మిరపకాయతో"

సీమ మిరపకాయల్లాంటి మరదళ్ళు యిట్లాంటి పాటలతో కుటుంబాల్లో నవ్వుల పువ్వులు పూయించేవారు.

అనామకులైన కవులో కవయిత్రులో అల్లిన యీ గేయాల్లో అక్కడక్కడ మధుర మంజులమైన శబ్దాలంకారాలు, అవి పాడే స్త్రీల గాజుల గలగలలు స్ఫురింపజేస్తాయి. "ఈడుజోడుగ నున్నవాడు, నేడు జనకజ గూడుతన్, వాడవాడా వేడెలందరు, కూడి చిత్రము చూడగన్"

ఇప్పటి వారికి కొన్ని పాటల్లోని హాస్యం కొంత మోటుగ అన్పించినా, పెళ్ళిళ్ళలో ఒక చిన్న కార్యక్రమంగా "పెళ్ళిపాటలు" పాడించడం బాగుంటుంది.

బాల్యంలో అత్తయ్యలూ, పెత్తల్లులూ యింకా యిరుగూ పొరుగూ,

బంధువులూ వద్ద నేర్చుకున్న పాటలకు తనే రాగాలు కూర్చి పాడుకుంటున్నవి సేకరించి పుస్తకరూపంలో మన వారసత్వాన్ని భద్రంగా మన కందించిన అనసూయాదేవి అభినందనీయులు.

ఒక చిన్న సూచన. ఇంకా రెండు సంపుటాలు రాబోతున్నాయి గాబట్టి (లాలిపాటలు, పండుగలు - వ్రతాల పాటలు వగైరా), వివిధ ప్రాంతాలకు చెందిన యీ పాటల పుట్టుపూర్వోత్తరాలువంటి వివరాలు జతపరుస్తే, సాధారణ పాఠకులకే కాకుండా, యిటువంటి విషయాలపై పరిశోధనాసక్తి వున్నవారికి కూడా వుపయోగంగా వుంటుంది.

జేబు రుమాలు - ఇతర కథలు - రచన: బుర్రా వెంకట సుబ్రహ్మణ్యం - ప్రచురణ: బుర్రా వెంకటసుబ్బమ్మ, తెలుగు లిటరరీ పబ్లికేషన్స్ ట్రస్ట్, హైదరాబాదు. ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, హైద్రాబాదు మరియు వారి శాఖలు; ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాదు. వెల: రు. 10-00.

చాలా ఏళ్ళ క్రిందట చక్రపాణి సంపాదకత్వంలో 'ఆంధ్రజ్యోతి' మాస పత్రిక వెలువడుతున్నప్పుడు, 'విజయ' అనే నవల అందులో ధారావాహికంగా వస్తూ వుండేది. అయితే సగంలోనే ఆ రచన ఆగిపోయింది. బుర్రా వెంకట సుబ్రహ్మణ్యం అనగానే ఒక తరం పాఠకులను అమితంగా ఆకర్షించిన ఆ అసంపూర్తి నవల గుర్తుకి వస్తుంది.

సంఖ్యలో తక్కువ రచనలు చేసినా చేయి తిరిగిన కథా రచయిత బుర్రా. ఒక విలక్షణమైన శైలి, అన్‌పొల్యూటెడ్ భాషా (అన్నీ 1930 - 40ల మధ్య రాసినవి) "జేబురుమాలు" కథలలో కనబడతాయి.

"వీరి చాలా కథలలో స్త్రీ పురుష సంబంధాలు, ప్రేమ, వాటి పర్యవసానాలు ముఖ్య కథా వస్తువులు" అని 'ప్రవేశిక'లో డి. రామలింగం చెప్పిన మాటలో అతిశయోక్తి లేదు.

ఆయన చేసిన పరిచయం చాలా సునిశితంగా విశ్లేషణాత్మకంగా వున్నది

జేబురుమాలు, స్వేచ్ఛ, అపస్వరాలు కథలు చదివినప్పుడు స్త్రీ పాత్రల చిత్రణలో రచయిత ప్రెజుడిస్ చూపించారేమోనని సందేహ పడినా, వంశవృక్షం, ఎండమావులు, వ్రాత చదివాక ఆ భ్రాంతి తొలగిపోతుంది. రకరకాల మానవులూ - వారు స్త్రీలయినా పురుషులయినా - వారి చిత్తవృత్తులను శోధించి పాఠకుల ముందు పెట్టడమే రచయిత లక్ష్యంగా అర్థమవుతుంది.

నింపాదిగా కథ చెప్పుకుపోయే తీరూ, పాత్రల మనోభావాలను సున్నితంగా ఆవిష్కరించడం, చివరలో మెరుపుల్లాంటి రెండు ప్రతిభావంతమైన వాక్యాల్లో మనుష్యుల స్వభావం, ప్రవర్తనా గురించి వ్యాఖ్యానించటం - యీ

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచనమృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతక నేర్చిన జాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం, ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 30 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |



20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు, ముందుగా ఆ పుస్తకాల ధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V. P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.



క్వాలిటీ పబ్లిషర్స్

రచయిత ప్రత్యేకతలు. "పారిస్‌లో జీవించే ప్రతి జీవికీ రెండు వ్యతిరేకమైన మనో గుణాలుంటాయి. ఒక మనో గుణానికి జీవిత పరిస్థితులతో మైత్రి, రెండవ గుణానికి జీవిత పరిస్థితులతో వైరం. రెండూ ముఖ్యమైనవే."....
'పరామర్శ'లో "ఈ భూలోకం బాలా విచిత్రమైనది. ఎవరికీ మరొకరి సంగతి తెలియదు. కాని అందరూ మిగిలిన అందరి జీవితాలలోనూ చొరబడతారు" ఇటువంటివి రచయితలోని ప్రత్యేకతకు వుదాహరణలు.

'జేబురుమాలు' కథ అంతా ఒక విశిష్టమైన శిల్పంతో వుంటుంది. కథ అంతా పాత్రల మధ్య జరిగే సంభాషణల ద్వారానే మనకు తెలుస్తుంది. 'పరామర్శ'లో హీరోయిన్ అంతరంగపు లోతుల నుండి కథ పైకి వస్తుంది. ఆమెకి నారాయణరావు పై గల ప్రేమ, ఆమె కట్టుకున్న భవిష్యత్ సౌధం, అది కూలిపోయినా, ఆమెలో యింకా ఆరని ఆశలూ, చివరకు నారాయణరావు చనిపోయాక అతని భార్య సీతని పరామర్శించడానికి వెళ్ళినప్పుడు ఆమె నవ్విన చిన్న చిరునవ్వు, దాని అంతరార్థం – అన్నీ ఒకటొకటిగా చిత్రిస్తూ పోవడంలో రచయిత నైపుణ్యం నిరూపితమవుతుంది.

'వంశవృక్షం' లో వీరన్న వంకర చిటికెన వేళ్ళున్న కొడుకుని హత్య చేస్తాడు. యజమాని వంశంలో వుండే వంకర చిటికెన వేళ్ళు తన కొడుక్కి రావడంలోని అర్థం గ్రహించి!

పారిస్, వ్రాత, ఎండమావులు – అన్నీ 50 ఏళ్ళ క్రింద వ్రాసినా మానవ నైజంలోని కొన్ని మారని ప్రవృత్తులను చిత్రించేవవడంవల్ల వాడని పూలలాగా ఎప్పటికీ అర్థవంతంగా వుండిపోతాయి.

వాస్తవికత, సృజనాత్మకత సమపాళ్ళలో మేళవించిన వుత్తమ రచనలు బుచ్చిబాబు గారి కథలు.

విలువైన యీ సంపుటి వెల పదిరూపాయలే వుంచడం, ప్రచురణ కర్తల సదాశయాలను వెల్లడిచేస్తూ వున్నది.

—సరోజినీ ప్రేమ్‌చంద్

మహాభారతకథామంజరి - (Mahabharatha Katha Manjari) తెలుగు మాతృక : చిలకమర్తి లక్ష్మీనరసింహం. ఆంగ్లానువాదం : యమ్ యస్ రమేష్ ఐఎయస్. ప్రచురణ : శ్రీరామకృష్ణ సమితి, గాంధీనగర్, విజయవాడ - 3 .... వెల : రు 6 - 00

'సత్యము, మంచితనము, స్నేహము, విశ్వాసము, పట్టుదల, నిశ్చలబుద్ధి – ఈ ఆరింటితోబాటు వీటి వ్యతిరేక లక్షణాలు కూడా జీవితంలో అంతర్భాగమై ఉంటాయి. ఈ పరస్పర స్పర్థ అంతర్వీక్షణకు ఉపకరిస్తూ, నైతిక విలువనీ, తద్వారా ఆధ్యాత్మిక చింతనను వొనగూరుస్తుంది. దృష్టాంత కథలు (Parables

మనని ఆలోచింపజేయడం ఒకవిధంగా సాధనే' - అంటున్నారు ఈ పుస్తకానికి పరిచయ వాక్యాలు వ్రాసిన స్వామీ శ్రీరంగానంద.

తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహాయంతో వెలువడిన ఈ పుస్తకంలో 19 భారతకథలు ఉన్నాయి.... 'దీర్ఘదర్శి, ప్రాప్త కాలజ్ఞ, యథావశిష్య' - ఎండిపోనున్న నీటి మడుగులోని మూడు చేపలకథ 'పంచతంత్రం'లోనిదని అనుకుంటాం- కాని, దాని మూలాధారం 'మహా భారతం'.... శంఖా, లిఖిత సోదరుల కథ, రాజుకి సైతం న్యాయం తెలిపే నీతికోవిదుల కథ. శునకమాంసం భుజించిన విశ్వామిత్రుడు, కపోత వాక్యం, సప్తఋషులు, నారద నార దీయం, హంస-కాకి, శిఖండిగా జన్మిం చిన అంబ - ఇందులోని కథలన్నీ చక్కగా రసవత్తరంగా మనసుకి హత్తుకుంటాయి. యమ్మెస్ రమేష్ ఆంగ్లశైలీ, ఆంగ్లభాషానువాదమూ ప్రశంసనీయంగా ఉన్నాయి.

—క్షీరసాగరమ్

రంగభూమి - నవల. రచన: ప్రేమ్ చంద్. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లి షింగ్ హవుజ్ 4-1-435 విజ్ఞాన భవన్, బాంక్‌స్ట్రీట్, హైదరాబాదు -1 .... వెల రు 35-00.

ఈ ద్వితీయ ముద్రణ 840 పేజీ లతో రెండు భాగలుగా వున్నది. అయి దారు దశాబ్దాలకు పూర్వం భారత దేశ స్థితిగతులను ఆనాటి గ్రామీణ జీవితానికీ, రాజకీయ, సాంఘిక సమస్య లకూ అద్దం పట్టిన నవల యిది.

వారి శ్రామికవేత్త జాన్‌సేవక్ తను స్థాపించబోయే సిగరెట్ ఫ్యాక్టరీ కోసం, సూరదాస్ అనే గుడ్డిబిచ్చగాని భూమిని, తన కుటిలనీతితో ఆక్రమించు కుంటాడు. తన పూర్వీకులనుండీ ఆ భూమి తనకు సంక్రమించినా, అది తను నివసించే గ్రామీణ ప్రజలకు ఎంతో ఉపయోగకారిగా వుండాలన్నదే సూర దాస్ వాంఛితం. అందుకు భిన్నంగా .... అది జాన్‌సేవక్ అధికారం క్రిందకు వస్తుంది.

ప్రశాంత గ్రామీణ వాతావరణంలో కృత్రిమత్వం కుటిలత్వం వెకిలితనం చోటు చేసుకుంటాయి. కడపటికి ఆ గ్రామం యావత్తూ అధికార బలం గల ఫ్యాక్టరీ యజమాని పరమవుతుంది.

పారిశ్రామిక నాగరికత - ముం దుకు అడుగేస్తూ మంచిని కాల రాస్తూ న్నప్పుడు, జమీందారులు, పెట్టుబడీ దారులు, తమ తమ నిజరూపాలతో సాక్షాత్కరిస్తారు.

విదేశీయుల బారినుండి తమ స్వేచ్ఛను స్వాతంత్ర్యాన్నీ పరిరక్షించు కోవడానికి సామాన్య ప్రజానీకం పడే ఆరాటం - కన్నులకు కట్టినట్టుగా చిత్రిస్తారు ప్రేమ్‌చంద్. అడుగడు గునా మనిషి ఏలా పరిస్థితుల కను గుణంగా మారిపోతాడో ఈ నవల హృదయ విదారకంగా చెబుతుంది.

తను ఏమైపోయినా మనిషిగా మిగిలి, నీతికీ మంచితనానికి కట్టుబడి బ్రతికి, ఆఖరున తుపాకీ గుండుకు ఎరయై ప్రాణాలను కోల్పోయిన సూర దాసుని ఎన్నటికీ మర్చిపోలేము. అప్ప టికి ఇప్పటికీ నేలనీ నీతినీ నమ్ముకొన్న పేద రైతులే మనకు నిజమైన రక్ష.

—ఎమ్ అన్నపూర్ణారెడ్డి

## ఈ మధ్య అందినవి :

శుక్లపక్షము - గేయాలు. పైడి పాటి సుబ్బారామ శాస్త్రి. పైడిపాటి పబ్లికేషన్స్, విజయవాడ - 4.... రు. 12-00.

విశ్వ విభూతి - కాశీవిశ్వనాథ శతకం. ఆచార్య తిరుమల. చైతన్య కళాశాల, హైదరాబాదు - 1.... రు 3-00.

అమృత నేత్రాలు - కవిత. ఆచార్య తిరుమల. విప్ల పబ్లికేషన్స్, హైదరా బాదు - 20....రు 20-00.

గెలుపు - కథలు. డి. సుజాతాదేవి.. స్పందన సాహితీ సమాఖ్య, మచిలీ పట్నం - 1 .... రు 12-00

ప్రావ్దా (పరమ సత్యం). అద్దంకి మన్నార్....అద్దంకి శ్రీరామ్ కుమార్, కానుమోలు - కృష్ణాజిల్లా రు 5-00.

వరాలు - గేయకావ్యం డి. సుజాతాదేవి. స్పందన సాహితీ సమాఖ్య మచిలీపట్నం - 1 .... రు 8-00.

'ఆంధ్రజ్యోతి' - దీపావళి సంచిక. ఎడిటర్ : పురాణం సుబ్రహ్మణ్య శర్మ, ఆంధ్రా ప్రింటర్స్, విజయవాడ - 10 .... రు 12-00.

- పారిశ్రామిక సంచిక దీపావళి సందర్భంగా. ఎడిటర్ : వి రామ్మోహనరావు.... పిబి 1041. హైదరాబాదు - 29.... రు 12-00

అందుకున్న పుస్తకాలన్నీ గాక పోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి



నన్నడిగితే సంభాషణా వరుల్ని రెండు రకాలుగా విభజింపవచ్చు. ఎదుటవారు చెబుతున్నది శ్రద్ధగా వినే వారు ఒక రకం ; వారు అలా చెబుతూ వుండగా, తాము విసరదలుచుకున్న ఛలోక్తి గురించి ఆలోచించేవారు మరొకరకం, —బిల్వీవ్

స్త్రీ పురుషుల మనస్తత్వంలో తేడా ఎక్కడంటే, పురుషుడు తనకి కావలసిన రూపాయి వస్తువుని రెండు రూపాయి లిచ్చి అయినా కొంటాడు ; స్త్రీయేమో తనకి అక్కర్లేని రెండు రూపాయల వస్తువుని రూపాయికి కొంటుంది.

—విలియమ్ బింజ్

బద్ధకంగా ఉన్నప్పుడు ఒంటరిగా ఉండకు : ఒంటరిగా ఉన్నప్పుడు బద్ధ కంగా ఉండకు. —టెన్నిసన్

# చండూర్ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్ మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వెర్బిస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవచైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యడం
పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్తలోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుహూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడో లేడో
మావో పాలనలో
చైనాలో మైనారిటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

**వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్న వారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి**

సమీక్షలు

# చిత్రజగతి

## వియమ్‌సి వారి 'కిరాయిదాదా'

చెల్లెలు కాలేజి ఫీజు కట్టేందుకు తన టెక్స్‌ట్ బుక్స్ అమ్మిన విజయ్ (నాగార్జున్); రేషన్‌షాపులోని సరుకు ప్రజలందరికీ సక్రమంగా అందేందుకు అహింసకాదని హింసామార్గం అవలంబించి, మాలినీదేవి (జయసుధ) దృష్టిలోపడ్డ విజయ్; అప్పటికే రేఖ (కుష్బు), లత (అమల) అనే యిద్దరు కాలేజి అమ్మాయిల మనసున మెదులుతున్న మనోనాథుడైన విజయ్, తల్లికి సరియైన వైద్యం చేయించేందుకు చెల్లెలుకి మంచి సంబంధం కుదుర్చి పెళ్లి చేసేందుకు, మాలినీదేవి వద్ద కిరాయి పనికి సమ్మతిస్తాడు. రత్నగిరి సంస్థానాధీశుడు నాగరాజు (రావు గోపాలరావు) వద్ద మొదట లారీడ్రయివరుగా చేరి, ఆ పైన జీపు డ్రయివరుగా ప్రమోట్ అయి రేఖా, లతలను రైలు స్టేషన్ వద్ద నుంచి దివాణానికి తెచ్చి, యిక్కడి రహస్యాలు మాలినీదేవికి అందజేస్తూ వుంటాడు. ఎవరీ మాలినీదేవి? పధ్నాలుగేళ్ల జైలు శిక్ష గడిపి, అసలు రహస్యం అరుణమ్మకు (జయసుధ) చెబుదామని వచ్చి, తన ౹ ముందు తుది శ్వాస వొదిలిన స౹ మూర్తి (మురళీమోహన్) ద్వారా జరిగినదేమిటో తెలుసుకొని, గానాబజానా జీవితానికి స్వస్తి చేప్పేందుకు పెట్రోలు పోసి ఆ యిల్లు తగలబెట్టి, మాలినీదేవిగా మారిపోతుంది అరుణ. లక్షలు విరజిమ్మగల మాలినీదేవి, గానాబజానా జీవితం ఎందుకు గడపవలసి వచ్చిందని మనం అడక్కూడదు. అలాగే ప్రజలని వేలిముద్రలతో వంచించగలమనుకొనే జమీందారులు కూడా సినిమాల్లోనే కనిపిస్తారు. శత్రువులను దునుమాడే సాహసిక హీరోపై మరులు గొన్న ఇద్దరమ్మాయిలలో భాగ్యవంతులమ్మాయి, బీదపిల్లకు తన మనోచోరునికి దానం చేస్తుంది. దుష్టుడైన దామోదరమూ (గొల్లపూడి), ఆస్తికోసం తమ్ముడు కృష్ణని (కృష్ణంరాజు) చంపించి, అతని భార్యని కూడా చంపించానుకొన్న జమీందారూ తమ పాపఫలం అనుభవిస్తారు. స్క్రీన్‌ప్లే చక్కటి సస్పెన్స్‌తో ప్రేక్షకులని ఆకట్టుకుంటుంది. పదునైన సంభాషణలు, శ్రావ్యమైన సంగీతం.

దర్శకత్వం : కోదండరామిరెడ్డి, నిర్మాత : దొరైస్వామిరాజు.

## శ్రీనాథ్ వారి 'న్యాయానికి శిక్ష'

మన కోర్టులూ, న్యాయవాద వృత్తీ, పోలీసుశాఖా రాజకీయ కాలుష్య కారణంగా ఎటువంటి దుస్థితిలో వున్నదీ ధైర్యంగా చెప్పే సంచలన చిత్రమిది. జుడిషరీని చులకన చేయ కూడదుగాని ఈ కథా సంవిధానంలో, దౌర్జన్యశక్తులు బుజుమార్గాన నడువ నున్న న్యాయమూర్తి నోరు నొక్కుతాయి. 'నాన్నా, న్యాయం కోసం, స్త్రీల రక్షణ కోసం నేను కోర్టులో వాదించ గలను ; సహేతుకమైన సాక్ష్యాలు చూపగలను. కాని, నీ తీర్పు దేనిమీద ఆధారపడి వుంటుందో నాకు తెలుసు'- అని బ్రీఫ్‌కేసులో నోట్లకట్టలు పెట్టుకు వచ్చి, ఎన్నో సంవత్సరాల తర్వాత తండ్రి గడప తొక్కిన కూతురు, అడ్వకేట్ శ్రీదేవి (శ్రీవిద్య) చెబు తున్నప్పుడు, ఆ సన్నివేశంలో కొంత నాటకీయత తోచినప్పటికీ, సీతని (భానుప్రియ) కాపాడే చివరి ప్రయత్న మది - అని మనకి అనిపించక మానదు. అభాగ్యురాలైన ఒక స్త్రీని, న్యాయ వ్యవస్థపట్ల పరిపూర్ణ విశ్వాసం గల మరొకస్త్రీ, యమ్మెల్యే అయిన తన భర్త (గిరిబాబు) ట్రాఫిక్ నేరం చేసినప్పుడు, నిజాన్ని నిర్భయంగా కోర్టులో చెప్పి అబద్ధమాడటం కంటె అయిదువందలు జుల్మానా చెల్లించ డంలో నిజాయితీతనం వుందని నమ్మిన వ్యక్తి - మంత్రిగా నియమింప బడ్డ తన భర్తవల్లనే దారుణంగా హత్య గావింపబడుతుంది - అప్పటికి అయిదారేళ్లబట్టి విడిగా ఉంటున్నప్ప టికి! మంత్రి అవగానే అధికారంతో బాటు కొమ్ములొస్తాయి. పంచాయితీ బోర్డు ప్రెసిడెంట్ ధర్మరాజు (కోట శ్రీనివాసరావు) ఎక్కువకూలీ అడిగిన సూర్యాన్ని, చంపించి, వైద్యంచేసిన డాక్టరుపై ఆ హత్యానేరం మోపి, జైలుకి పంపించి, అతని భార్య సీతని అంగటిబొమ్మగా చేసేందుకు పోలీసు యినస్పెక్టరు వద్దకు చేర్చగా, ఈమె అతనివద్ద నుంచి తప్పించుకోగలుగు తుందిగాని మేకవన్నె పులీ మహిళా బంధు అయిన ప్రజాపతిరావు (రఘు) వల్ల వంచింపబడుతుంది. కోర్టులో న్యాయం లభించక, శ్రీదేవి సహ కారంతో సంధ్యగా మారి, ముల్లుని ముల్లుతోనే తీస్తుంది – ప్రజల తిరుగు బాటుతో ప్రజావంచకులూ, దుర్నీతి పరులూ అంతమవుతారు. రాజకీయాల గుప్పెట్లో నలిగి కుళ్లిపోతున్న ఈ వ్యవస్థను కూకటి వేళ్లతో పెగల్చాలి- అనే సందేశాత్మక చిత్రమిది. ఇంతటి సీరియస్ చిత్రంలోను నవ్వించే సంద ర్భాలూ, ఆ నవ్వుల మధ్య జాలువారే కన్నీటి ముత్యాలూ ఎన్నో వున్నాయి. సంభాషణలు : హరనాథరావు. దర్శ కత్వం : తాతినేని రామారావు. నిర్మాత : శివలింగేశ్వరరావు.

ఎక్కడ విన్నా
ప్రజాస్వామ్యం
గురించే......

ప్రజాస్వామ్యపు విధానాల్ని-
జరుగుతున్న అన్యాయాల్ని
యధా తథంగా
చిత్రించిన ఏకైక చిత్రం!



# ప్రజాస్వామ్యం



## డివియస్ వారి 'భానుమతిగారి మొగుడు'

భానుమతి (విజయశాంతి) భాగ్యవంతులమ్మాయి - వెండితెరమీద కనిపించే భాగ్యవంతులమ్మాయిలకుండే దుర్లక్షణాలన్నిటికీ ఆమె వారసురాలు. మొగరౌడీల్లా ముక్కుపుటాలు తుడుచుకొనే ఈ పొగరుమోతు పిల్లకు, తనకి బోలెడంత డబ్బు వుందనీ, తన మాటకెవరూ ఎదురు చెప్పకూడదనీ అహంకారమే తప్ప, లోకజ్ఞానం ఉండదు. అన్నా వొదినలు (గిరిబాబు - అరుణ) ఉన్నారు గాని తలిదండ్రులు లేరు. తన కూతురు పెళ్లిచేసుకు స్థిరపడ్డాక, కూతురికీ అల్లుడికీ ఆస్తి చెందాలని వీలునామా రాస్తాడు తండ్రి. (ప్రస్తుత 'లా' ప్రకారం మగపిల్లవాడు జనించగానే ఎలా హక్కు ఏర్పడుతున్నదో ఆడపిల్ల విషయంలోనూ అంతే! అయితే, సాధారణంగా అనుకుంటున్నటు సరిసమానవాటా రాదు. తండ్రి సైతం ఆమెకి పుట్టుకతో సంక్రమించే హక్కుని అన్యాక్రాంతం చేయలేడు. సినిమా కథలకు యిలాటి విషయాలు అఖ్ఖర్లేదనుకోండి - అది వేరే విషయం).... పల్లెటూరి మనిషి, అన్యకాంతలపట్ల హైందవ సంప్రదాయ బద్ధుడూ, సద్వర్తనుడూ, 'ఎకరం పొలంలో చెరుకుతోట దిగుడుబావి బోరింగ్‌పంపు చేతిపంపు' అని గౌరి (అశ్వని) తన ఎకరం గురించి ఎంత కవ్విస్తున్నా అపరప్రవరాఖ్యుడై సంచరించగల ధీరోదాత్తనాయకుడూ అయిన జయకృష్ణ (బాలకృష్ణ), ధన సంపాదనకు పట్నం వచ్చి, సినిమాల్లో 'డూప్'గా చేరి, భానుమతి తినిపించిన అయిస్‌క్రీమ్‌తో ఆమెకి డూప్ భర్త అయి, ఎన్నో సినిమా ఫైట్స్ జరిపి, ఎంతో నాటకమాడి, పెల్లుబీటీ కోరిన భానుమతిలో పరివర్తన తెచ్చి ఆమెకి నిజభర్త అవుతాడు. ఈ ఫార్ములా పిక్చర్లో నేటి ప్రజకు కావాలనుకొనే మసాలాలన్నీ వున్నాయి తప్ప పాత్ర చిత్రణలో స్వభావ న్యాయం లేదు - సందర్భ శుద్ధి లేదు. వ్యాపార సూత్రాల వరవడినే దృష్టిలో పెట్టుకు నడిచిన ఈ చిత్రానికి దర్శకులు కోదండరామిరెడ్డి. నిర్మాత : డివియస్ రాజు.

## దేవర్ ఫిలింస్ 'ఇలవేల్పు'

వెండితెర మీద విజయానికి మనుషుల్ని నమ్ముకోవడం కంటె జంతువులపై భరోసా వుంచడం ఎన్నోవిధాల శ్రేయస్కరమనీ, ఫలవంతమనీ, లాభదాయకమనీ అనేక తడవులు రుజువు చేశారు. చిన్నప్పదేవర. అదే వరవడిని నటరాజన్ దర్శకత్వం వహించిన ఈ చిత్రంలో రాముడి (ఏనుగు పిల్ల) ప్రధాన పాత్ర ; ఈ రామూకి సహాయపడుతుంది ఒక వానరం. రామూని అపాయం నుంచి కాపాడుతాడు ఫారెస్ట్ ఆఫీసరు (శరత్‌బాబు) ; ఆయన భార్య (సుజాత), తల్లిని కోల్పోయిన ఈ రాముని, తన కొడుకు రాజాకు అన్నగా

స్వీకరిస్తుంది. అన్నదమ్ముల బాంధవ్యం రామూ రాజాలది. విలనులు ఫారెస్ట్ ఆఫీసరుని ఒక మర్డర్ కేసులోయిరికించి జైలుకి పంపడం, నిరాధార అయిన అతని భార్య పట్నం చేరుకోగా, తన తల్లినీ తమ్ముడినీ వెతుక్కుంటూ ఈ రామూ పట్నం రావడం, ఈ పెంపుడు ఏనుగు పిల్ల, చుట్టూ వారికి మచ్చిక అవడం, హనుమంతుని సహాయంతో అందరికీ విడుదల కలిగించి, తన కర్తవ్యం నెరవేర్చడం - మొత్తం మీద పిక్చర్ చూస్తున్నంత సేపూ కల్లాకపటం, కుత్సితం కుతంత్రం తెలియని సాధు జంతువుల మధ్యనున్న భావన కలుగుతుంది. మృగరాజునిగాక గజరాజుని ఆరాధించి, గౌరవించే సంస్కృతి మనది ; నీతి కథలు జంతువుల ద్వారా చెప్పించడం ఎంత సుబోధకమో పంచ తంత్రం ఏనాడో చెప్పింది.

## సురేష్ వారి
## 'ఆహా నా పెళ్లంట'

'మాయాబజార్' లోని సావిత్రి పాట క్రెడిట్ టైటిల్స్‌గా ప్రారంభమైన ఈ హాస్యరస చిత్రంలో, కస్తూరి సత్యం నూతన ప్రసాద్) తండ్రి: కస్తూరి కృష్ణ (రాజేంద్ర ప్రసాద్) తనయుడు. ఈ తండ్రీ తనయులు రోడ్డుకడ్డంగా వ్యాయామ నిమిత్తం సైకిళ్లు తొక్కుతున్నప్పుడు, బుక్ చేసిన పోలీసు యిన స్పెక్టరు, సత్యం గారి ఆటోబయాగ్రఫీ విని, శోష వచ్చి, అండమాన్ దీవులకు ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటాడు. ఆయన ఆటోబయాగ్రఫీ మొదలు పెట్లాడూ అంటే, ఎంతటివాడూ ఆముదంతాగిన మొహం పెట్టి, 'మహాప్రభో రక్షించండి' అని మొర పెట్టుకోక తప్పదు. పాపం, లేడీ వార్డెన్ అవస్థా అంతే అవుతుంది. ఇక తండ్రీ కొడుకుల పంతాలూ పట్టింపులూ ఎంత అధునికమంటే, ఎవరు ఎక్కువ విలువైన వస్తువులు పగలగొడితే, వారు ఆనాటి విజేతలు. ఇప్పుడో కోటీశ్వరుడైన కస్తూరి సత్యనారాయణ అతి సామాన్యంగా వున్న చిన్నప్పుడు, ప్రేమించి పెళ్లి చేసుకొని, బంధువు లందరికీ దూరమయాడు; కృష్ణను ప్రసవించాక, భార్య కూడా మరణిస్తుంది. వీరిది ప్రేమ జంట అయినప్పటికీ, తన కూతురు లేచి పోయిందని, ఆ అవమానం భరించలేక వురేసుకు చచ్చిపోతుంది సత్యం అత్త గారు. ఇటువంటి చేదు అనుభవాల కారణంగా, తన కొడుక్కి సంప్రదాయ సిద్ధంగా, పెళ్లి చేద్దామనుకుంటాడు సత్యం. అయితే, సుపుత్రుడు కృష్ణమూర్తి, దొంగ ఎక్కిళ్ల దాహం తీర్చిన ఒక పద్మ (రజని) ప్రేమలో నిలువునా కూరుకు పోయివున్నాడు. ఫోటోగ్రాఫూ, ఆకాశ సీతమ్మ ఉత్తరం పని చేయక పోవడంతో, రికార్డ్ డాన్స్ ద్వారా తమ ప్రేమోదంతం తండ్రికి తెలియబరిచి, తండ్రీ కొడుకుల సవాల్ అనంతరం, లుబ్ధాగ్రేసర చక్రవర్తి అయిన పద్మ తండ్రిలో (కోట శ్రీనివాసరావు) పరివర్తన తెచ్చి, ప్రేమకు విజయం చేకూరుస్తాడు కస్తూరి కృష్ణమూర్తి. అడుగడుగునా నవ్వులతో ముంచెత్తుతూ, చివరినొక చిలిపి నవ్వుతో

సాగనంపే ఈ చిత్రానికి ద ర్శ కు లు జంధ్యాల; నిర్మాత: రామానాయుడు.

## వేజెళ్ల 'తాతావతారం'

అసలు తాత (కోటాశ్రీనివాసరావు) అమెరికా వెళ్లగా, వడ్డీతాత (రావి కొండల్రావు) సంరక్షణలో ఒక నెల్లాళ్ల పాటు వుండవలసి వచ్చిన గోపాలకృష్ణ (నరేష్), కాలేజీ ప్రియురాలు తులసి (సాగరిక), వారం రోజులే గడువు యిచ్చిన కారణాన, పాతిక వేలతో ఇంట్లో నుంచి పారిపోయి, ఆ పెట్టె కాస్తా మరొక పంజాబీ (రంగనాథ్) పెట్టెతో తారుమారు చేసుకు, నానా బీభత్సంతో బికారిగా చిట్టిబాబు (వేలు) వద్ద తేల్తాడు. అమెరికా నుంచి వచ్చిన తాతగారు మొదట్లో తులసీ గోపాలకృష్ణుల పరిణయానికి అమందానందకందళిత హృదయారవిందుడై ఆమోదించినప్పటికీ, అమ్మాయి తల్లిని చూడగానే బ్రేకు వేస్తాడు. అదికీచుమంటుందే తప్ప బండిని నిలపలేక పోతుంది. .... కొన్ని సన్నివేశాల హాస్య కల్పనలో అస్వాభావికత వున్నప్పటికీ, ఫారుల్మా పద్ధతి అనేక సందర్భాలలో అనుసరించినప్పటికీ, రావి కొండల్రావు, కోటాశ్రీనివాసరావు హాయిగా నవ్విస్తారు. రాధాకుమారి, ప్లీడరుభర్త, చిట్టిబాబు కూడా అంతే ! సాగరికి, నరేష్‌లు పాత్రోచిత న్యాయం చేశారు. తులసి తల్లి, ఆ అమ్మాయి జన్మ వృత్తాంతం వెల్లడించి, గోపాలకృష్ణ తండ్రికి వుంపుడుకత్తె ద్వారా సంతానం కాదని నమ్మకంగా చెప్పడంతో మబ్బులు విడిపోతాయి .... దర్శకత్వం :వేజెళ్ల.

## యమ్మెస్ ఆర్ట్ 'ఆహుతి'

'లా' చదివిన శాంతిని (జీవిత), మనసారా ప్రేమించిన యువతిని, తను యమ్మెల్యే అయ్యేందుకు, ఒక రాత్రికి పడుపుకత్తెగా మారమని అర్ధిస్తాడు శంభుప్రసాద్. ఇటువంటి పరమ నీచుణ్ణా తను యిన్నాళ్లూనమ్ముకున్నది - అని విస్తుపోతుంది శాంతి. అప్పటికే గర్భవతి గనక, అవివాహితమాత అయి, ఆ అయిదేళ్ల పిల్లవాణ్ణి చదివిస్తూ, తను పబ్లిక్ ప్రాసిక్యూటర్ వద్ద జూనియర్‌గా చేరుతుంది. ప్రజలలో తన యిమేజ్ పెరిగేందుకు, అశోక్ (రాజేంద్రప్రసాద్) డిస్టిలరీస్‌పై కత్తి కడతాడు హోమ్‌శాఖమంత్రి శంభుప్రసాద్. ధనాధిపతుల అక్రమార్జనతో రాజకీయ పార్టీలు ఎలా ఊపిరిపోసుకుంటున్నదీ, శంభుప్రసాద్ అశోక్‌ల మధ్య జరిగిన వాగ్వివాదం ఎంతో సమంజసంగాను, అర్ధవంతంగాను ఉంది. అయితే,యిక్కడి లక్ష్మీపుత్రుడు తన వర్గ న్యాయాన్నిగాక తననే సంరక్షించుకొనే వాడవటంతో హీరో విలనుల వరవడి తీసుకొంది పిక్చర్. అధికార వ్యామోహంలోని కుత్సితాలనీ వంచనా శిల్పాన్ని ఎంతో సమర్ధవంతంగా చూపారు దర్శకులు కోడి రామకృష్ణ. రాజేంద్రప్రసాద్ తన

పాత్రకు న్యాయం చేకూర్చగా, జీవి
తన వేదనాగీతికలో రామణీయ
నొలికించింది. క్లయిమాక్సులో శాం
అక్కడికి రానవసరం లేదు - అశో
సెంటిమెంటల్ ఫూల్ కానక్కర్లేదు

కూడిన సంచనాత్మక చిత్రం. నిర్మాత : శ్యామ్‌ప్రసాద్ రెడ్డి : సమర్పణ : యమ్మెస్‌రెడ్డి.

## మందాకిని చిత్ర 'పుష్పక విమానము'

మాటలూ పాటలూ లేని ఈ చిత్రంలో కమలహాసన్ కథానాయకుడు. సినిమాహాలు పక్కనున్న ఆ యింట్లో, అందులోనూ పైడాబామీద గదిలో, రాత్రి ఒంటిగంట దాకా ఎటువంటి శబ్దవాహినులైనా వినిపించవచ్చు. పిచ్చుకగూళ్లవంటి గదులెన్నో గల ఆ యింట్లో మరుగు దొడ్లకి క్యూ. అల్యూమినమ్ కెటిల్‌లో టీ పట్టుకొచ్చే కుర్రాడు, పైసలు పుచ్చుకున్న తర్వాతగాని, టీ గ్లాసు యివ్వడు. తన పేదరికం గురించి దిగులు ఎంత మాత్రం లేదు హీరోకి - ఉద్యోగాల వేట అతని నిత్యకృత్యం. టక్ చేసుకున్న షర్టుకి టై కట్టుకు మరీ నిలబడతాడు నిరుద్యోగుల క్యూలో.... బెడ తాగి, చెట్టుమొదలు నానుకు, మైకంలో సుఖ నిద్రపోతున్న ఒక పెద్దమనిషి కనిపిస్తాడు యితనికి ఒక రోజున. చార్లీ చాప్లిన్‌లా మంచిపనులు చేసే స్వభావంగల ఈ యువకుడు, ఆ స్థూల శరీరుని బుజాలమీద మోసుకు, తన రూమ్‌కి పట్టుకొస్తాడు. అతని జేబులోని పుష్పక్ హొటల్ గది తాళం తీసుకు, ఆ గదికి దర్జాగా వెళ్లి, అక్కడ వున్న సంపదకు, నోట్లకట్టలకు ఆశ్చర్యపోతాడు. తన డ్రస్ మార్చుకు, నోట్ల కట్టలలో ఒక్కటి మాత్రమే తన స్వంతానికి తీసుకు, స్థూల శరీరుని తన గదిలోనే బంధించి, అతనికి పరిచర్యచేస్తూ తను పుష్పక విమానంలో విహరిస్తూంటాడు. ట్రావెలింగ్ మెజీషియన్ కూతురు (అమల) సైగలతో ఈ అమాయక అందగానిని ప్రేమిస్తుంది. తన ప్రమేయం లేకుండానే అయిస్ కత్తుల ఉపద్రవంలో యిరుక్కుంటాడు హీరో.... విడిపోయిన దంపతులు రాజీ పడటం, మెజీషియన్ కూతురు తలిదండ్రులతో మరో ఊరు వెళ్లిపోవడంతో మనవాడు మళ్లీ మామూలు మనిషి అవుతాడు.... దిక్కాట్ర పార్వతి (తమిళం), బారమ్మ (కన్నడ), మయూరి (తెలుగు) వంటి పిక్చర్లు తీసిన సింగీతం శ్రీనివాసరావు ఈ సంభాషణారహిత చిత్రకావ్యానికి దర్శకులు. గౌరీశంకర్ కెమెరావర్క్, వైద్యనాథన్ మ్యూజిక్ ఎంతో గొప్పగా ఉన్నాయి. విజయలక్ష్మి యాక్టనూతో కూడిన ఈ చిత్రానికి నిర్మాత : నాగరాజు.

---

మనసుకి బంధవిముక్తి నిచ్చేది, 'చీకటి బిలాలకు కాంతిని తెచ్చేది' హృదయ సీమను పుష్పింపజేసేది ? - స్వాతంత్ర్యం. —బైరన్

సీరియల్

# భ్రమర గీతం

## అచ్యుత - [illegible]

గడిచిన కథ : రామజోగి పంతులు ప్రాపకంతో చలపతి యమ్మె బి యల్ అయ్యాడు. పంతులుగారి మనుమరాలు మెరిలిన్ : ఆమె కూతురు సుమనతో గ్రామాభ్యుదయం చర్చిస్తున్నాడు చలపతి. ఇతనిని మనసా అభిమానించే భ్రమర, బంధువులందరికీ దూరంగా పట్నంలో ఉంది .... ఇక చదవండి.

"అదే నలుగురు భూస్వాములు కలిసి ఒక సినిమా థియేటర్ కట్టుకుంటే సగంమంది జనం వూళ్ళోనే వుంటారు. అల్లాగే చిన్న చిన్న స్టడీ సర్కిల్స్ పెట్టుకోవచ్చును. ఏ వూరికి ఆ వూరు. పొరుగూరు కన్నా మన వూరే మిన్న అన్నట్లుగా, సౌకర్యాలు అమర్చుకోవచ్చును. కాని యువకులంతా నగర విలాసానికి బానిసలై వెళ్ళిపోవటంతో ఎప్పటికప్పుడు గ్రామాలు వేరే ఉపాధి లేని వాళ్ళతో నిండి పోవడంతో స్తబ్దంగా వుండిపోతున్నాయి" అన్నాడు చలపతి.

"బాగానే వున్నాయి నీవు చెప్పిన మాటలు. గ్రామాభ్యుదయం, సాంఘిక సంక్షేమం అంటూ కోట్ల కొలది రూపాయలు ఖర్చు చేస్తోంది ప్రభుత్వం! ఒక్క పల్లెటూరులోనూ స్కూలు భవనం అంటూ వుండదు. నీ ఇంట్లోనో, నా ఇంట్లోనో స్కూలు అంటూ నామ మాత్రపు బోర్డుతో పదిమంది పిల్లలు ఎక్కాలు వల్లెవేస్తూ వుంటారు. ప్రభుత్వం నుంచి జీతం తీసుకుంటున్న వాళ్ళే పట్టించుకోక పోతే ఇంక సాధారణ గ్రామీణులు ఏమి చేయగలరు?" అంది సుమన.

"ఏమి చేయగలరు అనే నిస్పృహ కంటే, ఏమి చేయలేరు అనే ధైర్యం కావాలి. యువజనులు సంఘాలుగా ఏర్పడాలి. ప్రభుత్వ ఉద్యోగులు తమ కని కేటాయించిన నిధులు ఇవ్వటానికి జాప్యం చేస్తే ఆఫీసర్లకి రిపోర్టులు ఇవ్వాలి - ఐచ్ఛికంగా తమ వూరు అన్ని వూర్లకన్నా శుచికి శుభ్రతకి మారు పేరుగా వుండాలి అనే అభిమానంతో చేయాలి. మన ఇల్లును మనం ఎందుకని శుభ్రం చేసుకుంటాం? అందుకనే వూరిని కూడా శుభ్రం చేయాలి" అన్నాడు చలపతి.

"గ్రామీణులు అంత సులభంగా ఒకరి మాట ఒకరు వినరు — ఒక నాయకుడిని అంగీకరించ లేని అసూయ

వుంటుంది. ఎవరన్నా ముందుకు వచ్చి ఇల్లా చేద్దాం అంటే, ఈసడించి పారే స్తారు. అంతేకాని ఇతని సలహాలు పాటించి చూద్దాం అనుకోరు. నిర్వ్యాపారులైన యువకులు గ్రామాలలో కనపడుతూనే వుంటారు. అల్లా గ్రామాలు మురికిలో మునుగుతూనే వుంటాయి .... ఇంకొకటి వుంది, కొంచెం విద్యాగంధం అంటిన వాళ్ళు తామేదో దివి నుంచి భువికి దిగి వచ్చిన దేవతల మనుకుంటూ నలుగురితోనూ కలవకుండా వుంటారు. మూడువంతుల మంది చదువుకున్న వాళ్ళు పట్నం జీవితమే కోరుకుంటారు. వాలీ బాలని ఇరుకు మురికి గదుల్లో జీవిత కాలమంతా గడిపేస్తారు. యాంత్రిక జీవితం అలవాటు అయిన వాళ్ళకి ప్రశాంతత, స్తబ్దత నచ్చదు" అన్నాడు చలపతి.

సుమన తల ఊపింది. ఆమెకి ఒక ఆలోచన వచ్చింది. పుట్టిబుద్ధి ఎరుగున్న దగ్గర్నుంచి తను మహానగరాల్లో పెరిగింది. చదువుకుంది. తనకి తను ఒక లక్ష్యం ఏర్పరుచుకోవాలి. భ్రమరలా సంసారంతో తెగ తెంపులు చేసుకోకూడదు. సుగుణలా తెలుగింటి సగటు ఆడపిల్లలా అత్తవారింటికి అతుక్కుపోకూడదు. తల్లి మనస్సుకి బాధ కలిగించకూడదు. ఒక విద్యావంతురాలయిన యువతిగా, తను ఒక వ్యక్తిత్వం సంపాదించుకోవాలి. దానికి తన తల్లిని అడిగి, తాతగారి సలహా తీసుకొని వేమవరం కేంద్రం చేసుకోవాలి. ఇల్లు వాకిలి పొలం తోటా వున్న ధనికవర్గానికి చెందిన యువతి తను కనుక తనని అనుసరించటానికి చాలా మంది ముందుకు వస్తారు. తమ తాత ముత్తాతలు శ్రమించిన వూరు వేమవరం. ఆ ఊరికి ఒక ఉన్నతి తేవాలి-అనుకుంది సుమన. చలపతి కూడా ఆమె అభిప్రాయానికి చాలా సంతోషపడ్డాడు.

* * *

టెలిగ్రాం చూసి జడుసుకున్నాడు చలపతి. బిజినెస్ పనులతో తీరిక వుండటం లేదు. లక్ష్మణరావు బయటి పనులకి తిరగటం మాను కున్నాడు. వసుధకు పెళ్ళి చేసారు. విమల చదువుకుంటోంది.

"ఎందుకు ఇచ్చిందో ఒక్కసారి వెళ్ళిరద్దూ!" అంది మేరిలిన్.

"తల్లికో అక్కకో రమ్మని ఇవ్వచ్చు కదా - నీకెందుకు రమ్మని టెలిగ్రాం ఇవ్వటం? ఆ అమ్మాయి సమస్యలు నీకేమి తెలుస్తాయి?" అన్నాడు లక్ష్మణరావు. తండ్రి మాటలకి 'వెళ్ళవద్దు' అనుకున్నాడు. కాని ఈ విద్యార్జన అంతా ఆ అమ్మాయి చలువల్లే కదా-అన్న కృతజ్ఞతా భావం కట్టిపడేసింది. సాయంకాలం గోపాలరావు గారిని కలిసాడు.

"ఒక వారం వూరు వెళ్ళాల్సి వుంటుంది" అన్నాడు.

"ఏమిటయ్యా ఉరమని పిడుగులా చెప్తావు. రెండు మూడు రోజుల్లో ఆడిట్ చేయాలను కుంటున్నారు. ఇప్పుడు గైర్ హాజర్ అయితే ఎల్లాగు?"

"భ్రమర టెలిగ్రాం ఇచ్చింది రమ్మని. అక్కడి వ్యవహారాలు ఏమిటో తెలుసుకుని వచ్చేసరికి వారం పదిరోజులు పట్టవచ్చును" అన్నాడు.

"ఆదా సంగతి!" అన్నాడు గోపా

భ్రమర చాలాసార్లు తనని రమ్మని వ్రాసింది – ఎప్పటికప్పుడు ఇక్కడి విషయాలన్నీ భ్రమరకి తెలియ పరుస్తూనే వున్నాడు.

"మీ నాన్న గారు తిరగలేకపోతే, చూసుకుందుకు భార్య ఆడపిల్లలు వున్నారు. నీ బ్రైట్ ఫ్యూచర్ తగల బడిపోతే ఏడవటానికి మటుకు నేను సిద్ధంగాలేను" అంటూ వ్రాసింది.

"నిన్ను నా జీవితం గురించి ఏడ్చేందుకు సిద్ధంగా వుండమని కోరలేదు. నిన్ను శాసించటం నాకు సబబు కాదు. ఎప్పటికయినా నిన్ను నువ్వు తెలుసుకుంటే, మీ అమ్మ కన్నా ఎక్కువగా సంతోషించటమే నేను చేయగలను" అని వ్రాసాడు. తనకి వ్యక్తిత్వం లేదా? ఇక్కడ అందరూ తనని గౌరవించుతున్నారు. తండ్రి, తల్లి తమ కష్టం ఫలించిందని పొంగి పోతున్నారు. ఇక్కడ ఒక ప్రశాంతత, తృప్తి వుంటున్నాయి. అక్కడ లాలస, తృష్ణ తాండవిస్తూ వుంటాయి. అక్కడ భ్రమర విలాసజీవితానికి ఒక హంగుదారు తాను. ఇక్కడ ఒక సంసారనావని ఒడిదుడుకులు లేకుండా నడిపే చుక్కాని. భ్రమర తన జీవితంలోకి రావటానికి ఎప్పుడూ ఒక అధికారం, తన మనస్సు పొరల్లో అట్టడుగున దాచు



హవాయ్ ద్వీపం అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఏభైయ్యోది. వారి ప్రభువుల్లో ఒకాయన పేరు కమేహయేహా – 1819లో మరణించాడు. ఒకసారి ఈయన తనపై విసిరిన ఆరుబల్లేలని ఆపగలిగాడట. మూడు పట్టుకున్నాడు – రెండు తప్పించుకున్నాడు – ఒకటి తగల కుండా పక్కకి వొరిగాడు.

కున్నాడు. ఆమె జీవితంలోకి మటుకు తను చొరబడడు, అన్నీ మరచి తన దారిలోనికి వస్తే ఈ చల్లటి గృహ జీవన ప్రాంగణం లోనికి అనావృత హృదయంతో ఆహ్వానిస్తాడు. ఇక్కడ బిజినెస్, కంపెనీ పనులు అభివృద్ధిలో వున్నాయి. ఆర్ధికంగా ఒకరిని చేయి చాపి అడగటం లేదు. తన క్రింద బోలెడంత మంది పని చేస్తున్నారు. తన సమర్ధత మీద అందరికీ నమ్మకం, గౌరవం వున్నాయి. ఆ అమ్మాయికి తను ఒక కూపస్త మండూకంలా, తల్లి తండ్రుల చంకబిడ్డలా కన్పించితే అది

ఆమె వక్రదృష్టికి నిదర్శనం మాత్రమే! ఎన్నిసార్లు తన ఆర్థిక పురోభివృద్ధి, తన ఉద్దేశ్యం వ్రాసినా భ్రమర ఎక సెక్కంగా జవాబు వ్రాస్తుంది తప్ప, తనతో సెటిల్ అవుదామన్న ఉద్దేశ్యం వ్యక్తీకరించలేదు. తగినంత అవసరంవచ్చి వుంటుంది. అందుకనే ఈ టెలిగ్రాం - అనుకున్నాడు.

"నీమీద నమ్మకం వుంది, చలపతీ ఎల్లాగో అల్లాగా ఒప్పించి ఇక్కడకు తీసుకు వచ్చెయ్యి. కని పెంచిన తల్లిని కూడా చూడాలనిపించలేదు దానికి" అంది మేరిలిన్.

"చూడు, చలపతీ! భ్రమర చాలా తెలివయిన పిల్ల అంటున్నావు - ఇంత మంది స్వంతవాళ్ళు వుండగా నీకే ఎందుకు రమ్మని టెలిగ్రాం ఇచ్చింది? నువ్విప్పుడు గౌరవప్రదమయిన స్థానంలో వున్నావు - లక్షల వ్యాపారం చేస్తున్న బిజినెస్‌కి మానేజర్ అంటే మాటలు కాదు. నీ విద్య, పట్టుదల, కార్యదీక్ష చూసి ఇంత చిన్న వయసులోనే పెద్ద కుర్చీలో కూర్చోబెట్టాము నీలాంటి వ్యక్తికి 'డార్క్ కార్నర్స్' వుండకూడదు. నలుగురు పెద్దలతో హుందాగా వుండాలి." వార్నింగ్ ఇచ్చినట్లే అన్నాడు గోపాలరావు. చలపతికి ప్రాణం చివుక్కు మనిపించింది, ఇన్ని రోజుల బట్టి తన ప్రవర్తనని పరిశీలించుతూనే వున్నాడు. రామజోగి పంతులు గారి దయాభిక్ష వల్ల తనకీ విద్య వచ్చింది. వాళ్ళ డబ్బుతోటే బిజినెస్ ఫర్మ్ నడుపుతున్నారు. అల్లాంటిది వాళ్ళ అమ్మాయి రమ్మని వ్రాస్తేతే ఇంత ఆరాటమా? స్నేహం అన్నదానికి సరయిన నిర్వచనం మనుష్యుల మధ్య ఏ స్టేజీలో వుంటుందో? ఎన్ని రోజులు గడిస్తే స్త్రీ పురుషుల మధ్య మామూలు స్నేహం వుంచ వచ్చో?

♦ ♦ ♦

చలపతి, భ్రమర ఇంటికి వెళ్ళేసరికి బాగా చీకటి అయ్యింది. బాబూరావు వచ్చి ముందు వరండా తలుపు తీసాడు. వరండాకు గ్రిల్స్ వుంటాయి. వరండాలో ఒక సోఫాసెట్టు టీపాయి వుంది. రెండు మూడు మాగజైన్స్ ఏవో వున్నాయి. బాబూరావు ప్రక్క వాటాలోంచి పెద్ద పింగాణీ ప్లేటులో రెండు మూడు చపాతీలు బంగాళ దుంపల కూర తెచ్చాడు ఛా కూడా తెచ్చాడు.

"ఇప్పుడెందుకు ఆవిడ రానీయి", అన్నాడు చలపతి.

"దీదీ ఇప్పుడప్పుడే రాదు సాబ్ వచ్చినా రాత్రికి ఇంకేమి వంట చేయదు," అన్నాడు బాబూరావు.

ప్రక్కనున్న వాటిలో ఒక రిటయిర్ మిలటరీ మేజర్ వుంటున్నాడు. వాళ్ళు బెంగాలీ వాళ్ళు. బాబూరావు మేజర్ గార్కి దూరపు బంధువు. వీళ్ళకి చిన్న చిన్న పనులు సాయం చేస్తూ వుంటాడు. చలపతి తినేసి, మాగజైన్స్ తిరగేస్తున్నాడు. బాబూరావు ఖాళీ ప్లేటు వాళ్ళ వాటాలో పెట్టేసి వచ్చాడు

"నాకు ఆంధ్రా వద్దామని వుంది. సాబ్" అన్నాడు.

"ఏం నీకు ఇక్కడ బాగాలేదా? అన్నాడు చలపతి. బాబూరావుకి బెంగాలీ, ఇంగ్లీషు తప్ప ఇంకేమి రావు.

బొద్దుగా తెల్లగా వుంటాడు. మెరిసే కళ్ళు, బూరె బుగ్గలు. బి. ఎ. ఫస్టియర్ చదుతున్నాడుట.

"బాగు లేక కాదు, సాబ్ -దీ దీ వాళ్ళది పెద్ద జమిందారీ కుటుంబంట కదా - వాళ్ళ అమ్మ ఒక్కరూ వుండ లేక పోతున్నారుట, నాకా తల్లితండ్రులు లేరు, అన్నదమ్ములు లేరు, సాబ్ - ఒక అక్క వున్నాది. ఎల్లాగో కష్టంగా అత్తవారింట వుంది. అయిదు గులు పిల్లలు ఆవిడకి! ఆమెకి నేను భారంగా వుండటం ఇష్టం లేక మేజర్ సాబ్ వద్ద వుంటున్నాను. దీ దీ నన్ను ఆంధ్రాకు బట్వాడా చేస్తానం టోంది" అన్నాడు బాబూరావు. ఆంధ్రా పేరు తలుస్తేనే బాబూరావు ముఖం వెలిగిపోతూంది.

"మరి చదువు ఎల్లాగ?" అన్నాడు చలపతి.

"ఏం చదువుకుంటాను, సాబ్ - ఇక్కడ మేజరాంటీ నన్ను తినేస్తూంది. అక్కడ పనే వుండదుట కదా - బోలె డంత మంది నౌకర్లంట! హాయిగా వుండవచ్చునట - నన్ను వాళ్ళమ్మ గారు స్వంత కొడుకులాగ చూసు కుంటారుట, సాబ్, దీ దీ వాళ్ళ నాన్న గారు కూడా బెంగాలీటకదా" అన్నాడు గొంతు తగ్గించి గుసగుసగా. భ్రమర, బాబూరావుకి ఆకాశంలోని నక్షత్రాలని లెఖ్ఖపెట్టడం నేర్పుతోందా? కష్ట నష్టాలకి ఓర్చి జీవితాన్ని ముందుడుగు వేయించాల్సిన తరుణంలో అలస్వత్వ భావాన్ని, సులువయిన జీవితాన్ని ప్రోత్సాహించటం మంచిదా? చలపతికి



ఏది సత్యం, ఏది అసత్యం? - అనే యుద్ధాలలోనే కాదు, ఎన్నికలలో కూడా తెలీదు. విజయదుందుభితో సమస్తం సర్దుమణిగి పోతుంది ఒక మాటకు అనేకార్థాలు స్ఫురింపజేస్తూ మాటలను ఈటెలుగా వాడుతారని 20వ శతాబ్దిలో హెచ్చరించినది జార్జ్ ఆర్వెల్.



భ్రమర తత్వం అంతు పట్టలేదు బాబూరావుతో కబురు చెబుతూ నిద్రలోకి జారుకున్నాడు చలపతి.

"మీకు నిద్ర వస్తోందా?" అన్నాడు బాబురావు.

"ఆ ఆ" అన్నాడు కళ్ళు మూసు కునే.

సోఫాలో ఒత్తిగిల్లి పడుకున్నాడు చలపతి. బాబూరావు మాటలు సగం వినిపించనే లేదు చలపతికి. ఆ నిద్ర నిద్రా తెల్లగా తెల్లవారిన తర్వాత ఏడుగంటలకి మెలుకువ వచ్చింది

అంతవరకూ తను వరండాలో సోఫా లోనే నిద్రపోయానని తెలిసింది. రాత్రి తనని ఎందుకు లేపలేదు ? రమ్మని టెలిగ్రాం ఇచ్చిన మనిషి రాగానే వెంటనే నిద్రలేపి వెంటనే చెప్పనక్కర లేదా? దిగ్గున లేచాడు. వంటింట్లోకి వెళ్ళాడు. భ్రమర తల స్నానం చేసినట్లుంది. జుట్టు జారు ముడి వేసుకుంది. కాఫీ కలిపి ఫ్లాస్కులో పోస్తూంది.

'ఎందుకు అంత అర్జంటుగా రమ్మని టెలిగ్రాం ఇచ్చావు ?' అన్నాడు.

"ముందుముఖం కడుగు. నాస్తా కాఫీ అయినాక, మన విషయాలలోకి వద్దాం" అంది.

"అంత తీరిగ్గా చర్చించాల్సిన విషయాలా ? అవతల బోలెడుపనులు వున్నాయి నాకు," అన్నాడు ముఖం ముడుచుకుని.

"నీకు పనిలేనిదెప్పుడు? రెండేళ్ళ బట్టి పని చేస్తూనే వున్నావు కదా !"

"ఎన్నిసార్లు రమ్మన్నాను. రావటానికి నీకేం వచ్చింది? అందర్నీ వదిలి వంటి పిల్లి రాకాసిలా ఇక్కడ నువ్వేంచావుకుంటున్నావు?" ప్రేమగా మందలించినట్లుగా అన్నాడు.

"ఏదో నాకు నచ్చినట్లుగా వుంటున్నాను. ముందుపని కానీయి. తర్వాత తీరిగ్గా పోట్లాడుకుందాము" అంది. చలపతి స్నానం చేసి వచ్చే సరికి వంటింట్లో పీట వాల్చింది. ప్లేట్లోనాలుగు ఇడ్లీలు, పచ్చడీ వేసింది. తనొక ప్లేటులో నాలుగు ఇడ్లీలు పెట్టుకు కూర్చుంది.

"డైనింగ్ టేబుల్, కుర్చీలు ఏవి?"

"అల్లామధ్యగదిలోకి చూడు !"

చూశాడు. డబల్ కాట్, ఫోం బెడ్ లేవు. చాపమీద ఒక పెద్ద పరుపు చుట్టేసి వుంది.

"ఏమిటి దేవదాసులో చంద్రముఖిలా ?"

"అన్నీ అమ్మేశాను. చాలా అప్పులు అయిపోయాయి. అంతా తీర్చెయ్యాలి. ఈ వూరిలో ఇంక వుండ బుద్ధి పుట్టడం లేదు. ఇంటికి పగిడీ క్రింద ఏడు వేలు ఇచ్చాను. ఇప్పుడు ఒక ఫ్రెండు పదివేలు ఇస్తానన్నాడు. - వున్న అప్పులన్నీ తీర్చేస్తాను. వీటికి ఒక మగదిక్కు వుంటే బాగుంటుంది అని నీకు టెలిగ్రాం ఇచ్చాను," అంది.

"నీకు పట్టిన శని వదిలిందన్న మాట- ఇప్పటికయినా కళ్ళు తెరిపిన పడ్డాయి పోనీలే !" అన్నాడు. మర్నాడే ఇంకొక అతనికి ఇల్లు ఇచ్చినట్లు వ్రాసి పదివేలు తీసుకున్నాడు. బట్టల కొట్లో, పచారీ కొట్లో అప్పులు అన్నీ తీర్చేసాడు. భ్రమరకి కొంచెం వళ్ళు వచ్చింది. నిగారింపుతో తళ తళ మెరుస్తూంది. చేపల్లాంటి కళ్ళు తమాషాగా నవ్వుతున్నాయి. భ్రమర చాలా ఆనందంగా పొంగిపోతున్నట్లు కన్పించింది.

"నేను వచ్చిన పని అయినట్లేనా ?" అన్నాడు.

"ఓ ! నీ మీదుంచిన బాధ్యతని సక్రమంగా నిర్వర్తించావ్ !"

(ఇంకా వుంది

# ప్రతి గురువారం

గడిచిన కథ: బాబ్ దంపతులు ఒక చిన్న ఊరు నుంచి, మూడు వేల లోపు అమ్మే 'ఆర్కయివ్' అనే చిన్న పత్రిక నిర్వహిస్తున్నారు. అతను ఎడిటోరియలూ ఆమె యడ్వర్టయిజ్‌మెంట్సూ తమ కష్ట సుఖాలు జాన్ మెక్లవీన్ చెబుతున్నారు.
....చదవండి

'నా షాపు పేరు, నేను డబ్బిచ్చి, ఎందుకు వేయించుకోవాలి మీ పత్రికలో ? నా షాపు యిక్కడ ముప్ఫయిదేళ్ల బట్టీ—మా నాన్న కాలంనుంచీ - ఉంది. చుట్టుపట్ల అందరికీ తెలుసు, మా షాపు ఎక్కడ వుందో !'

లేకపోతే యిలా : 'మీ పత్రికకి సర్క్యులేషన్ ఎంత వుందని మీకు యడ్వర్టయిజ్‌మెంటు యిచ్చేందుకు ? యడ్వర్టయిజ్‌మెంటు యివ్వదలచుకుంటే, 12,000 మంది చదివే దిన పత్రికకి యివ్వక, మీకిచ్చేందుకు నాకేమయినా మతి పోయిందనుకున్నారా ?'

ఎండ అనక, వాన అనక - ఎక్కే గుమ్మం, దిగే గుమ్మం, విసుగెత్తి నిస్పృహ చెందాను. 'ఏదో వాళ్లు శ్రమ పడుతున్నారు ; కాస్త చేయూతనిద్దాం,' అని ఒక్కళ్ళూ అనుకోరే ! 'ఆర్కయివ్' కి అవకాశం యిస్తేగదా దాని ప్రతిభ రుజువయేందుకు !

ఈ నిరాశామయ ప్రపంచంలో మిన్ ఓలా ఒక్కత్తే నాకు కాస్త సంతోషాన్ని యిచ్చేది. మిన్ ఓలా పొట్టిగ లావుగా ఉంటుంది. బ్రహ్మచెముడు కాని, మంచి తెలివిగలది. గ్రిఫిత్ అను కంపెనీలో, పుస్తకాల బీరువాల పై అజమాయిషీ ఉద్యోగమామెది. గ్రిఫిత్స్‌లోకి వెళ్ళినపుడు, మామూలుగా పలకరించవలసిన వాళ్లని పలకరించి తిన్నగా ఆమె దగ్గరికి వెళ్లేదాన్ని.

గ్రిఫిత్స్ చాలా పాత సంస్థ. వందేళ్లబట్టీ ఉంటోంది అక్కడ. వారి దగ్గిర దొరకని వస్తువంటూ లేదు. పూలమొక్కల దగ్గర్నుంచి, ఫేషన్‌బుల్ డ్రెస్సులదాకా సమస్తం దొరుకుతాయి. గ్రిఫిత్స్ ఎంత పెద్దదంటే, వాళ్ల షాపులో వున్నవన్నీ వాళ్లకే తెలియవు. పురాతన వస్తువులకి అటకలు కట్టి, వాటిమీద పేర్చారు. అవి కావలసిన 'కష్టమర్' నిచ్చెన మెట్లు ఎక్కి, సాలెగూళ్లకి చీదరించుకోకుండా, తనకి కావలసిన వస్తువు ఏరుకోవచ్చు. అనిటికీ ధరలు వస్తువుల మీద వేసి ఉండవు ; గుమాస్తాలు తొందరగా మన మాట వినిపించుకోరు. 'దీనికి డబ్బు పుచ్చుకోండర్రోయ్' - అని మనం అరవవలసి వస్తుంది. సరసుడూ సహృదయుడూఅయిన ఎల్డర్ గ్రిఫిత్స్ రెండు

చేతులూ చావి, 'అయ్యో, దాని ధర నాకూ తెలియదు. ఒక ఏభై సెంట్లు పడేసి వెళ్లండి - సరి పెట్టించేస్తాను' అంటాడు.

యడ్వర్టయిజ్‌మెంటుల విషయం వచ్చినప్పుడు అతనంటాడు: 'మిస్ ఓలాని చూడండి. ఆమె ఎలా చెబితే అలా చేసెయ్యండి, దాని దేముంది?' ఎంతో చక్కగా చెబుతాడు.

పెట్టెల్లాటి గదులు దాటుకుంటూ, చివరనున్న మిస్ ఓలా దగ్గరికి వెళ్తాను. రసీదులూ పద్దుల పుస్తకాలూ ముందేసుకు కూచుని వుంటుంది మిస్ ఓలా

ఎప్పటి కప్పుడు కొత్తే ఆమెకి: ఊరు చివరి దుబ్బుల్లో నుంచి, తిన్నగా యిక్కడికొచ్చిన దయ్యాన్నేమో అన్నట్టుగా చూసేది.

పేపర్లు యిటూ అటూ సర్దుతూ, 'ఇంకా ఏమీ తయారు చేయలేదు. ఈ వారం కొత్తగా వచ్చినవి కదూ, చేపలు పట్టేటప్పుడు వేసుకునే బూట్లూ యిల్లు దులుపుకునే దుమ్ముచీపుర్లూ, కొత్తరకం పెయింట్లూ, చిక్కుడు విత్తనాలు....' అంటూ మధ్యలో ఆగిపోతుంది.

'అంతేనా, యింకా ఏమయినా వున్నాయా?'

ఆమెకి వినిపించదు.

'ఇంకా ఏమయినా వున్నాయా?' అని గట్టిగా అరుస్తాను.

ఇక లాభం లేదని. చెవి నా వైపుగా తిప్పి 'ఏమిటి?' అంటుంది.

'ధరలు' అని బిగ్గరగా నేను.

కాయితం మీద రాస్తాను.

'ధరలకేం ఫరవాలేదు చిక్కుడు. విత్తనాలు వచ్చాయని రాస్తే చాలు, ఇది వాటికి సీజన్.'

ఆమె చెప్పినవాటిలో ఏవి ఎంత వరకు యడ్వర్టయిజ్‌మెంటుగా వేయాలి, ఏవి వార్తలుగా వేయాలి అనేది సమస్యే! ఒకదానిలో ఒకటి కలిసిపోయివుంటాయి. ఏమైనా, బిల్లు విషయంలో యిబ్బంది లేదు. ఇది యింత ఎందుకయింది, అంత ఎందుకయింది? అను పేచీలు లేకుండా, మేము పంపిన బిల్లు మొత్తానికి నెలాఖరు అయేవేళకి చెక్కు వచ్చేస్తుంది.

సహనమనేది నా సహజ గుణాలో ఒకటి కాదు; కాని, యడ్వర్టయిజింగ్ వల్ల అది నేర్చుకోక తప్పింది కాదు. యడ్వర్టయిజర్లు వుట్టినే కూచో పెడుతున్నప్పుడు ఎంతో ఓర్పు ప్రదర్శించవలసి వచ్చేది. ఒక జోళ్ళషాపు మేనేజరు తమ జోళ్ల పెట్టెలు సర్దుకుంటూ, నన్ను 45 నిమిషాలపాటు కూచోబెట్టి, ఆఖర్ని తనకి మా పత్రికలో యడ్వర్టయిజ్ చేయాలని లేదన్నాడు. ఉండబట్టలేక నాలుగూ పెట్టాను, ఆమాట ముందే చెప్పొచ్చుగా!

ఆఫీసుకొచ్చి బాబ్‌కి ఆ సంగతి చెప్పేవేళకి 'అలాగా' అని వూరుకున్నాడు. స్త్రీలు కొద్దిగా బయటపడేటప్పటికి, పురుషులు తమ అధిక్యతని చూపుకోడానికి వెనుకాడరు.

'యడ్వర్టయిజ్‌మెంటులు తీసుకు రావడమనేది నీ బాధ్యత. వర్తక ధర్మంలోని మొదటి సూత్రం ఏమి

టంటే, కస్టమర్ ఎప్పుడూ రైటే. నీ విషయంలో కస్టమర్ అనేవాడు యిడ్వర్టయిజర్. నువ్వు అతనికి మన పత్రికలో స్థలం అమ్ముతున్నావు; అతనికి యిష్టమయితే కొనుక్కుంటాడు; లేక పోతే లేదు. ఓర్పు మనకి వుండాలి గాని యితరులని అని లాభం లేదు. ఎవరో మొరటుగా ప్రవర్తించారని మనమూ అలా వుంటే ఏలా? మొరటు దనాన్ని సౌమ్యతతోటే ఓడించగలం.'

బాబ్ మాటలకి మొదట కోపం వచ్చినా, విజయ సాధనకి ఆ సౌమ్య మార్గమే రాజబాట అని తెలుసు కున్నాను.

ఏ జోళ్ల కంపెనీ మేనేజరు నన్ను 45 నిమిషాలు వుట్టినే కూచోపెట్టాడో, అతనే చివరకు మా పత్రిక యావజ్జీవ యడ్వర్టయిజర్స్‌లో ఒకడయాడు.

నగలవర్తకుని షాపుకి మధ్యాహ్నం వేళ గాక పొద్దుటినే, అతని భార్య సణుగుడు ప్రారంభించక పూర్వం, అతని పాదాల మంటలు ప్రారంభం కాక పూర్వం వెళ్ళడం మంచిదని గ్రహించాను. ఎరిస్కిన్ దగ్గిరకెళ్ళి నప్పుడల్లా, వాళ్ళబ్బాయి చదువు విషయం అడిగేదాన్ని. బాగా చదువు కుంటున్నాడని అతను అంటే, ఏడెని మిది అంగుళాల యడ్వర్టయిజ్‌మెంటు ఖాయం. స్కూలు అధికారులు ఆ అబ్బాయిని యింటికి పంపించివుంటే ఎరిస్కిన్‌ని యడ్వర్టయిజ్ మెంటు అడిగి లాభం లేదు - వృథా. చిన్న పట్నంలో పత్రిక అంటే, నలుగురితో కలసి మెలసి పోగలగాలి. వారికి మన మీద యిష్టం కలిగేటట్టు చేసుకోవాలి. అంతేగాని, మన పత్రిక లక్ష కాపీలు

అమ్ముతున్నప్పటికి, చిన్న పట్నంలోని యడ్వర్టయిజర్ రెండు అంగుళాల ప్రకటన కూడా యివ్వడు - మనమంటే యిష్టపడక పోయిన పక్షంలో! పత్రికా ప్రచారం కాదు, - వ్యక్తిగత బాంధవ్యం ప్రధానం.

9

పెద్ద పత్రిక లెప్పుడూ ప్రజాకర్షణ కోసం, ప్రమాదకరమైన దుర్వార్తలకి ప్రాముఖ్యత నిస్తాయి. అందుకనే, సాధారణ పాఠకుడు దానివంక కాసేపు చూసి, చదువుకునేందుకు మట్టుకు వారపత్రిక చేత బుచ్చుకుంటాడు. సుశిక్షితులూ సద్వర్తనులూ అయిన పౌరుల కార్యకలాపాల గురించి ఉంటుంది ఆ వారపత్రికలో.

మహిళా సమితి గురించీ, కవున్సిల్ మీటింగు గురించి ఏ వారానికావారం కొత్తగా రాయడం మాటలు కాదు ఊహాగానం చేయడం బాగా చేతనై వుండాలి. ఏ వార్తనైనా సరే, ఆకర్షణీయంగా ప్రకటించాలి. మేము కొత్త పోకడలు పోయేటప్పటికి కొందరు అనుమానాస్పదంగా చూశారు. కొన్ని స్థానిక పారిశ్రామిక సంస్థల వాళ్లు, తమ గొప్పలు ప్రచురించేందుకు పత్రికలు వున్నాయనుకుంటారు.

మేము పత్రిక కొనేటప్పటికి, రెండు సొరుగుల నిండా ఫోటో బ్లాకులు వున్నాయి. ఆ ఫోటో బ్లాకుల మధ్య ఒక ఎలక నివాసం చేస్తోంది కూడాను. ఎప్పుడో చనిపోయిన గ్రామాధికారి దగ్గిర నుంచీ, ఈ మధ్య చనిపోయిన డాక్టరుదాకా వున్నాయి ఫోటోబ్లాకులు. డవునింగ్ టవున్ పట్నపు చరిత్ర అంతా మా ఆఫీసులో వుందనవచ్చు.

'ఆర్కైయివ్' పత్రిక 1875 లో స్థాపించబడింది. ఫోటో గ్రాఫర్ ఖర్చు లేకుండా బొమ్మలు దొరికాయి - మాకు, ప్రతివారం ఒక ఫోటో వెయ్యడం - గురువారం ఉదయం 9 గంటలు దాటిన తర్వాత వచ్చి, ఆ ఫోటో ఎవరిదో చెప్పగలిగిన మొదటి మనిషికి ఒక ఏడాదిపాటు 'ఆర్కైయివ్' పత్రిక ఉచితంగా లభిస్తుందనడం, జనాకర్ష మార్గం అనుకున్నాం.

మొదటివారంవందమందివచ్చారు, - మేము ప్రచురించిన ఫోటో ఎవరిదో చెప్పేందుకు. ఆ తర్వాత గురు శుక్ర శని వారాలు మూడు రోజులుగా రెండేసి వందలమంది వచ్చేవారు. 'మిస్టరీ హవుస్' ఒక్కటి తప్ప, మిగతా బొమ్మలు ఎవరెవరివో ఒక స్థానిక చరిత్రకారుని సహాయంతో, మేము ముందే తెలుసుకున్నాం. ఆ 'మిస్టరీ హవుస్' మట్టుకు ఎక్కడిదో



ఎవరెవరు? ఏ చిత్రంలోనిది ఆ వేషధారణ? సరిగా చెప్పగలిగి మొదటి ఇరువురికి పదేసి రూపాయిలు బహూకరించగలము. ఎక్కు మంది చెప్పగలిగినప్పుడు చీట్లువేసి మొదటి ఇరువురికే బహుమ యివ్వడం జరుగుతుంది. మీ జవాబు కార్డు మీదనే వ్రాయం మాకు అందవలసిన చివరి తేది: 15-2-1988.

JAGATI - 3, Kutchery Road, P.B. 2922, Madras - 600 004

ఎవరూ యింతదాక చెప్పలేకుండా ఉన్నారు. సంవత్సర ప్రారంభాన ఆ బొమ్మవేసి, 'మిస్టరీ హవుస్' ఏమిటో ఎక్కడో చెప్పగలిగిన వారికి 50 సెంట్లు బహుమతి అని ప్రచురిస్తున్నాం ప్రతి ఏడూ.

ఈ 'మిస్టరీ హవుస్' గురించిన వాద ప్రతివాదాలు పత్రిక వొచ్చిన రోజు వుదయం ప్రతిచోటా విని పిస్తాయి. ఆఖరికి పోస్టాఫీసులో కూడా పోస్టుమాన్, పోస్టుమిస్ట్రెస్, పొరులు కలిసి వాదించుకుంటూ వుంటారు. ఫలానా రాక్ రావెన్ మార్గంలో ఉందని ఒకరూ, 1930లో తగుల బడిపోయిన హావెన్‌స్టోర్స్ అని మరి ఒకరూ - యిలా రకరకాలుగా ఆ మిస్టరీ హవుస్‌ని పోల్చుకోబోతారు. ఒకరోజురాత్రి, ఒక చందాదారు మాకు ఫోను చేసి అడిగారు: 'అది ఎక్క డుందో మీరయినా చెబుదురూ - ఎవరికీ తెలియని బొమ్మవేసి మమ్మల్ని యిలా చంపడం బావూ లేదు.'

మిస్టరీ హవుస్‌ఫలానాచోట వుందనీ అది ఫలానావారి యిల్లు అనీ సూచ నలు వస్తూండేవి. ఫోటోగ్రాఫరుని పం పించి దాని బొమ్మ తీయించి, అచ్చువేసే వాళ్లం. ఫోటో తీయించడం, బ్లాకు చేయించడం - దీనంతటికీ చాలా ఖర్చ యేది. కాని పాఠకులు యిందు విషయమై ఎంతో ఆసక్తి కనబరిచే వారు. అందుచేత నాలుగు డబ్బులు ఖర్చయినా కష్టం తోచేది కాదు.

ఇక యడ్వర్టయిజ్‌మెంట్ల విష యంలో ఒక తమాషా పద్ధతి అవలం బించే వాళ్ళం. ఏ చందాదారు పేరు అయితే తన యడ్వర్టయిజ్‌మెంటులో కని పిస్తుందో, ఆ చందాదారుకి ఒక డాలరు విలువగల వస్తువులు ఉచితంగా యివ్వమని యడ్వర్టయిజర్లతో ఏర్పాటు చేసుకునేవాళ్ళం. ప్రతివారం చందా దారుల లిస్టులోనుంచి, ఏదో ఒక పేరు కళ్ళుమూసుకు తీసి, ఏదో ఒక యడ్వ ర్టయిజ్‌మెంటులో యిరికించేవాళ్ళం. ఇందువల్ల రెండు ప్రయోజనాలు. ఎంత చిన్న అక్షరాలలోవున్న యడ్వర్టయిజ్ మెంటు అయినా సరే, చందాదారు లందరూ తమ పేరు వుందేమో, తమకి డాలరు వస్తుందేమో - అని చదువుతారు తమ పేరు లేనప్పుడు, మేమేదో పక్ష పాతం చూపిస్తున్నామనీ, దగ్గిరవాళ్ళకే యివి ముట్టజెబుతున్నామనీ యిటు వంటి ఆరోపణలు లెక్కలేనన్ని వచ్చేవి. ఒకసారి ఒకావిడకి మామీద చాలా కోపం వచ్చింది. ఆమె పేరు పుష్పాల ప్రకటనలో ఉంది.

'పువ్వులా - వెధవపువ్వులు! పువ్వు లంటే నాకు మహాఅసహ్యం. నా మన మడికి ఒక ఆటవస్తువు కొని యిద్దామను కుంటే, మీ పుష్పాల ప్రకటనదారు పువ్వులు తప్ప యింకేమి యివ్వనంటు న్నాడు. ఇదేమి అన్యాయం ? నామన మడికి ఆటవస్తువు కొనుక్కోకూడదా నేను?' అంటూ టెలిఫోను మీద మమ్మల్ని దుయ్యబట్టుకుంది. మానవ స్వభావం ఎలాంటిదంటే, మనం, బటాణీ గింజలు పంచి పెడుతూవుండే పచ్చలు (Emeralds) ఎందుకు పంచి పెట్టటంలేదని అడుగుతారు.

(ఇంకా వుంది

